Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

“ దోబూచు లాడుతాం

పంపినవారు:
ఇ. ఎన్. ఆచార్య-నర్సాపురం

## చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక:
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



# తీసుకోండి

శ్రేష్ఠమైన కోకో గింజలు, కరిగే చక్కెర,
అత్యధికంగా గడ్డపాలుతో
తయారుచేయబడినవి,
నోట్లో వేయగానే కరిగి
పోవునట్లు అతి సన్నని
అణువుగా గుండ చేయ
బడినవి. ఎరుపు, బంగారు
రంగుల లేబెల్ తో చుట్టబడినవి.




# మీ




సమృద్ధిగా పాల చాకొలెట్ తో
పొదుగబడిన తేలికైన
రేకువంటి క్రీమ్ వేఫర్లు,
ప్రతివారూ కోరునట్టివి.
చోకో వేఫర్ అనుపేరు
జ్ఞాపకముంచుకోండి.
ఎరుపు, తెలుపు రంగుల
లేబెల్ తో చుట్టబడినవి.

# ఎన్నికైనవి

అసలైన చాకొలెట్ రుచికి పేరుకు
తగినట్లు సూపర్ బ్లెండ్ చాకొలెట్
దివ్యమైనది. అంతర్దేశీయ
బ్రాండ్ కోకోగింజలు
మరియు కంద చక్కెరలో
తయారుచేయబడిన
సూపర్ బ్లెండ్, అమోఘమైన
సువాసన, సమృద్ధిగా
పరిపక్వమైన రుచికరమైనవి. నీలం
మరియు వెండి లేబెల్ తో చుట్టబడినవి.




Heros-113. TEL

# ఇవి మీకోసం తయారు చేయబడినవి!

"ఉతికిన బట్టలు వచ్చాయా ?" అన్నాను.

"ఎలా వున్నాయి ? మెరుస్తున్నాయికదూ ! నా చేతులారా నేనే ఉతికాను" అందావిడ.

అన్ని ఎక్కువ బట్టలా ? అంత తెల్లగానా ? దండాలు కొట్టకుమరీ ! నువ్వుతికే శబ్దం వినపడనంత గాఢ నిద్ర పోలేదు నేను !" అన్నాను, "కాని, ఆవిడవిషయమంతా చెప్పగానే ఆశ్చర్య పడ్డాను !"

## భార్య చెప్పుచున్నది

"కమలను అద్భుతంగా మెచ్చుకున్నాను ! ఆమె మానవులకేగాక బట్టలకూ చికిత్సకురాలనిపించింది.





ఆమె బట్టలగురించి, 'నలుగులు, చిరుగులు, బొక్కల విరుపులు, ఇంకా ఎన్నో చెప్పుతుంటే ఆనంద పరవశురాలనయ్యాను''.

ఇలా అన్నది: "నీ భర్త అన్నట్లు బట్టల ఆరోగ్యంగురించిన్నీ శ్రద్ధవహించాలి. ఎన్నాళ్లో మురికి బట్టలను ఇంట్లోపడేసివుంచి మనకు కనిపించనిచోట ఉతుకుటకు పంపెయ్య గూడదు. శుద్ధమైన మంచి సబ్బుతో ఇంట్లో మనం ఉతుక్కోవటంతో మరేదీ సాటిలేదు."

"ఇది మంచి మాటే ! కాని ఇంట్లో ఉతుక్కుంటే ఇప్పుడు మీరు ధరించిన చీరంత మెరిసే తెల్లగావుంటుందంటారా ?'' అన్నాను. నా మాట నమ్ము. మా బట్టలన్నిటి లాగే ఈ చీరెను ఇంట్లో నేనే ఉతికాను.'' అని చిరునవ్వుతో జవాబిచ్చింది. "అంతట నన్నామె తనయింటికి తీసుకు వెళ్లింది. అక్కడ ఉతికి ఆరవేసిన మెరిసే బట్టలు కళ్లారా చూశాను !"

"ఎలాగైనా సన్‌లైట్ ధర గురించి ఆలోచిస్తే...'' అంటూంటే ఆమె అందుకున్నది: ''తరుచు బట్టలు చిరిగిపోయి, తరచు కొత్తవి కొనుక్కొనే ఖర్చు ఆలోచిస్తేనో, మరి సన్‌లైట్‌తో ఆ భయం లేదు. బట్టలన్నిటినీ బాదక్కర్లేకుండా చక్కగా ఉతుక్కో గలిగేంత సమృద్ధయిన గుణవంతమగు నురగను గలిగిస్తుంది. అంచే బట్టలు చాలాకాలం మన్నుతాయి. పైగా, కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను తెల్లగాను, కాంతిగాను ఉతుకుతుంది. నీవు తరుచు సబ్బు కొనక్కర్లేదు. అలా, రెండు విధాలా ఆదాయం; కాదూ ?"

''నే నింటికొస్తూ ఒక సన్‌లైట్ బిళ్ల కొనుక్కొచ్చి ఈ బట్టలన్నీ ఉతుకులకు వాడేను. ఇది నిజంగా డాక్టరు సలహాను బుజువు పర్చింది!'' అన్నాను మా ఆయనతో. మెరుస్తూన్న ఆ తెల్లని బట్టలరొంతర ఆశ్చర్యంగా చాలాసేపు చూశాక, ఆయన అకస్మాత్తుగా ఉత్సాహపడి "ఈ రాత్రిమనం సినిమాకి వెళ్దాం, తయారైయుండు, ప్రేయసీ!" అన్నారు.




S/P.4B-50 TL

బొంబాయిలోని హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్‌వారి ఉత్పత్తి

# రాలె




## 75 ఏళ్లుగా

## బైసికిల్సులో ప్రసిద్ధిగాంచిన మొదటిపేరు




ప్రపంచం మొత్తంలో లక్షలాది ప్రజలు పరీక్షచేసి, ఖరారుచేసిన రాలె 1886 నుంచి బైసికిల్సులో ప్రసిద్ధిగాంచిన మొదటిపేరుగా చెలామణీ అవుతున్నది. ఈ 75 సంవత్సరాలుగా రాలె ప్రతినిత్యం దినదినాభివృద్ధి గాంచుతునే వున్నది. కాగా నేడు రాలె ఇంతకుముందు వాటికంటే మేలుగా తయారై మీకు అందుబాటులో కలదు....శ్రేష్ఠతలో సాటిలేనిది. ఎంతమాత్రం తిప్పలుపెట్టదు.

**ఒక రాలె ఎంత ధరకైనా కొనతగ్గది!**

అదనపు సౌకర్యానికై
విట్‌కాప్ సీటు
వేసుకొండి

# సెన్-రాలె

SRC-65 TE












# రాజా

## హెయిర్ ఆయిల్

USE RAJA KASTURI SOAP FOR LUXURY BATH RAJA BAR SOAP FOR EASY WASHING

MFRS: MANYAM & CO., BANGALORE-20.


కుటుంబానికి
ఇష్టమైనవి
చేతికి ఇమిడికగానుండే ప్యాకెట్టులోగల
10 రుచికరమైన చక్రాలు తింటోవుంటే
అమితానందము కలుగును. ఇవి వేర్వేరు
రుచులలోగలవు.
ఒక ప్యాకెట్




Parle's
FRU
పార్లేవారి
ఫ్రూట్
డ్రాప్స్
పిప్పర్ మెంట్
EVEREST PR. 553 TEL

సెప్టెంబర్ 22 తేదీ నుండి ప్రదర్శింప బడుతున్నది





అశ్వరాజ్ వారి

# దీపావళి

(నరకాసుర కథ)

దర్శకత్వం

యస్.రజనీకాంత్ B.A

నిర్మాత

కె.గోపాలరావు









◀ చీలమండ బెణికిందా?



◀ కొంచెం రాయండి

# అమృతాంజనము



◀ వెంటనే గుణం కనిపిస్తుంది




మీకు అమృతాంజనము ఎప్పుడు కావలసివస్తుందో మీకే తెలియదు.
ఇంట్లో ఎప్పుడూ ఒక బుడ్డిని ఉంచండి. ఎంతైనా నమ్మకమైనది.

అమృతాంజన్ లిమిటెడ్

14/15, లజ్ చర్చి రోడ్డు, మద్రాసు-4 బొంబాయి-1, కలకత్తా-1, న్యూ ఢిల్లీ

JWT-AM 1092a




# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'


తన ప్రాణం ఒడ్డి అయినా ఇతరుడి ప్రాణం కాపాడటం ఉత్తమ ధర్మం అని బౌద్ధులు నమ్ముతారు. ఇటువంటి ధర్మాన్ని అవలంబించిన జీమూతవాహనుడి కథ కథాసరిత్సాగరంలో బేతాళ పంచవింశతి కథలలో ఉన్నది. దీనిని లోగడ [1955 డిసెంబరు] బేతాళ కథగా ప్రకటించాము. ఇదేకథను శ్రీహర్షుడు "నాగానందం" అనే నాటకంగా రచించాడు.

ఇటీవల సోవియెట్ శాస్త్రజ్ఞులు నాలుగున్నర టన్నుల బరువు గల ఒక గోళంలో కుక్కలనూ, ఎలుకలనూ, ఈగలనూ, మొక్కలనూ, విత్తనాలనూ పెట్టి, అంతరిక్షంలోకి పంపి, ఒకరోజల్లా భూమిచుట్టూ తిరగనిచ్చి, తిరిగి క్షేమంగా భూమిపైకి తెప్పించుకున్నారు. ఇక మనిషి అంతరిక్షంలోకి వెళ్ళే కాలం ఎంతో దూరంలో లేదు. దీపావళిలోగా ఇదికూడా జరుగుతుందని ఆశించుదాం!


సంపుటి 27 : అక్టోబర్ 1960 : సంచిక 4




మహారథుడైన సాత్యకి దారిలో అడ్డు తగిలిన యోధులనూ, సైన్యాలనూ చించి చెండాడుతూ అర్జునుడు యుద్ధంచేసే చోటును సమీపించాడు.

అయితే ధర్మరాజుకు అర్జునుడేమయాడో నన్న విచారం పట్టుకున్నది. అర్జునుడికి తోడు వెళ్ళిన సాత్యకి కూడా తిరిగి రాలేదు. అయన భీముడితో, "అర్జునుడి జాడగాని, అతనికోసం వెళ్లిన సాత్యకి జాడగాని తెలియరాలేదు. నువు వారిద్దరికీ అండగా వెళ్ళు," అని చెప్పాడు.

భీముడు ధర్మరాజును కాపాడే భారం ధృష్టద్యుమ్నుడిపైన పెట్టి తానుకూడా రథంలో అర్జున సాత్యకులు వెళ్లిన దిక్కుగా బయలుదేరాడు. అతన్ని ముందుగా ద్రోణుడు అడ్డగించాడు. అర్జున సాత్యకుల లాగే భీముడుకూడా తనకొక ప్రదక్షిణం చేసి ముందుకు సాగిపోతాడని ద్రోణుడు అనుకున్నాడు. కాని భీముడు అలాటిదేమీ చేయకపోగా ఒక బ్రహ్మాండమైన గదను గిరగిరా తిప్పి ద్రోణుడి రథంపైన విసిరాడు. అది చూస్తూనే, ద్రోణుడు రథంపైనుంచి కిందికి దూకేశాడు.

ఆ కౌరవ వ్యూహ ముఖాన భీముడు ధృతరాష్ట్రుడి కొడుకులతో తలపడి భయంకరమైన యుద్ధం చేసి, కుండభేది, సుషేణుడు, దీర్ఘనేత్రుడు, బృందారకుడు, అభయుడు, రౌద్రకర్ముడు, దుర్విమోచనుడు, సుశర్ముడు, సుదర్శనుడు మొదలైనవారిని చంపేశాడు.

భీముడు అర్జునుడు యుద్ధంచేసే ప్రాంతానికి చేరుకున్నాడు. అంతదూరాన అర్జునుడు కనిపించగానే భీముడు దిక్కులు పిక్కటిల్లే ఒక పెడబొబ్బ పెట్టాడు. అది విని ధర్మరాజు, అర్జునుడు క్షేమంగా ఉన్నాడని గ్రహించి ఎంతో సంతోషించాడు.



ఇక్కడ భీముడికి కర్ణుడు అడ్డుపడ్డాడు. ఇద్దరికీ అతి భయంకరమైన యుద్ధం జరిగింది. చిత్రమేమిటంటే భీముడు విల్లుతో యుద్ధం చేస్తూ కర్ణుణ్ణి ఓడించి విరథుణ్ణి చేశాడు. కర్ణుడు చావుదెబ్బ తిని పారిపోయి కూడా మరొక రథం ఎక్కి వచ్చి మళ్ళీ కలియబడ్డాడు.

కాని చివరకు భీముడు విరథుడూ, నిరాయుధుడూ అయిపోయాడు.

ఆ క్షణాన భీముడి ప్రాణాలు కర్ణుడి చేతిలో ఉన్నాయి. అయితే కర్ణుడు కుంతికి మాట ఇచ్చిఉన్నాడు: ఒక్క అర్జునుడు తప్ప మిగిలిన పాండవులెవరు తనకు చిక్కినా ప్రాణాలతో వదులుతానన్నాడు. అందుచేత కర్ణుడు భీముణ్ణి బాణంతో పొడుస్తూ, "తిండిపోతా, హాయిగా ఇంటిపట్టున తింటూ కూచోక మాబోటి యోధులతో పోట్లాడవస్తావా?" అని ఆక్షేపించాడు.

భీముడు తోకతొక్కిన తాచులాగా రోషంతో బుసలుకొడుతూ, "ఓరీ, దుష్టుడా, నా చేతిలో ఇన్నిసార్లు ఓడి పారిపోయి ఏమని గర్విస్తున్నావు? చాతనయితే నాతో మల్లయుద్ధానికి రా! ఆ కీచకుడున్నచోటికి పంపిస్తాను!" అన్నాడు. ఇంతలో అర్జునుడి బాణాలు వచ్చి కర్ణుడికి తగిలాయి. కర్ణుడు భీముణ్ణి విడిచి వెళ్ళిపోయాడు. భీముడు సాత్యకి రథమెక్కాడు. అర్జున భీమ సాత్యకులు ఒకచోట చేరుకున్నారు.

తరవాత సాత్యకికీ భూరిశ్రవుడికీ యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో సాత్యకి నిరాయుధుడయాడు. సాత్యకిని చంపే ఉద్దేశంతో భూరిశ్రవుడు కత్తి ఎత్తేసరికి, అర్జునుడు సమయానికి ఒక అర్థచంద్రాకారం గల బాణాన్ని గాండీవానికి సంధించి విడిచి భూరిశ్రవుడు ఎత్తిన చెయ్యి తెగవేశాడు. తరవాత సాత్యకి భూరిశ్రవుడి తల నరికేశాడు. భూరిశ్రవుడి హత్య అధర్మంగా జరిగిందని కొందరు కౌరవులు విమర్శించారు. "నిరా

యోధుడైన కుర్రవాడు అభిమన్యుడు చచ్చినప్పుడు మీ ధర్మబుద్ధి ఏమయింది?" అని సాత్యకి వారిని అడిగాడు.

త్వరలోనే అర్జునుడి రథం సైంధవుడి కేసి వెళ్ళింది. ఇదిచూసి దుర్యోధనుడు కర్ణుడితో, సైంధవుడికి సహాయంగా రమ్మన్నాడు. "భీముడు ఇవాళ నన్ను చాలా పీడించాడు. ఇవాళ్టికి ఇక యుద్ధం వద్దనుకున్నాను. అయినా నా శక్తికొద్దీ అర్జునుడికి అడ్డుపడతాను," అన్నాడు కర్ణుడు.

సూర్యాస్తమానం కావస్తున్నది. కాస్సేపు అర్జునుణ్ణి ముందుకు రానివ్వకుండాచేస్తే అతను చితి పేర్చుకు చస్తాడన్న ఆశతో దుర్యోధనుడూ, కర్ణుడూ, వృషసేనుడూ, శల్యుడూ, కృపుడూ, అశ్వత్థామా అర్జునుడితో తలపడ్డారు. భీమ సాత్యకులు అర్జునుడికి సహాయంగా ఉన్నారు. ఆ ముగ్గురితోనూ కర్ణుడు చాలా గొప్ప యుద్ధం చేశాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, సూర్యాస్తమయం గురించి ఏమాత్రమూ విచారించక అవకాశం దొరకగానే సైంధవుణ్ణి చంపెయ్యి," అంటూ తన యోగమాయచేత చీకటి కలిగించాడు.

కౌరవవీరుల ఆనందానికి మేరలేదు. వారు సూర్యుడున్నవేపు చూడసాగారు. సైంధవుడుకూడా మెడ నిక్కించి చూశాడు. "ఇదే సమయం!" అని కృష్ణుడు హెచ్చరించగా, అర్జునుడు ఒక దివ్యాస్త్రంతో అతని తల తెగవేసి, అది భూమిమీద పడకుండా వెళ్ళి సైంధవుడి తండ్రి ఒడిలో పడేలాగు చేశాడు. సైంధవుడి తలను ఎవరైతే భూమిపై పడేస్తారో వారు తల పగిలి చస్తారు. సైంధవుడి తండ్రి ఇలా శాపం పెట్టాడు. ఆ శాపం ఆయనకే తగిలింది. ఎక్కడో కూచుని తపస్సు చేసుకుంటున్న ఆ ముసలివాడి ఒడిలో పడిన సైంధవుడి తల ఆయన లేవగానే కింద పడింది. సైంధవుడి తండ్రి తల పగిలి చచ్చాడు.





# క్షీరసాగర మథనము

చతుర్థాశ్వాసము :

అమృతమందు ఆశతోడ
అరుదెంచిన నాగేంద్రుని
తరిగొండకు చుట్టబెట్టి,
త్రచ్చుటకై కొనిపోయిరి.

వాసుకి తల నాదిత్యులు
వహియింపగ, రక్కసు లది
చూచి తాము తోక గొనుట
నీచముగా భావించిరి.

"మేము తోక పట్టుకొనము,
మీకంటెను తీసిపోము;
తలభాగము మాకిం,"డని
దైత్యులు పోట్లాడినారు.

ఇంద్రుడంత లోలోపల
ఎంతయొ సంతోషించుచు,
తలభాగము వారికిచ్చి,
తమవారికి తోకిచ్చెను.

వాసుకి తల రక్కసులును
వాలమ్మును దేవతలును
తిరుగ గొని తరిగొండను
తెచ్చి తరుప దొడగినారు.

మెడనొప్పికి ఆ వాసుకి
పడగ విప్పి బుసకొట్టెను;
గిజగిజమని గింజుకొనుచు
క్రేళ్ళుఱుకుచు గీపెట్టెను.

భయమున రక్కసులంతట
పట్టు వదలి పెట్టినారు;
మందరగిరి బుడబుడమని
సందరమున మునిగిపోయె.

అయ్యోయని వారందఱు
అంతులేని దుఃఖమందు
మునిగి, ఏమి చేయలేక
మ్రొక్కుకొనిరి దైవమునకు.

ఉత్పల సత్యనారాయణాచార్య



ఒక్క పెద్ద తాబే లప్పు
డువ్వెత్తుగ బయలువెడలె.
పాలవెల్లి జలజలమని
పల్లమ్మున కొడిగిల్లె.

ఆ కూర్మము వీపుమీద
లోకమెల్ల నిలువవచ్చు,
అఖిల జంతు జాలములను
అది మ్రింగిన మ్రింగవచ్చు.

అంత పెద్ద కూర్మము గని
వింతపడిరి దైతేయులు;
శ్రీ విష్ణువుగాగ తలచి
సేవించిరి ఇంద్రాదులు.

అంతలోన కూర్మరాజు
అటకు వచ్చి, మందరమును
ఉవ్వెత్తుగ పైకెత్తెను,
ఒక ముత్యపు చిప్పనువలె!

మందరగిరి పయికి తేల
అందఱు ముదమొందినారు;
ఇరువైపుల చేరి వారు
మరల తరువ సాగినారు.

తరిగొండయు కుడి యెడమల
దిరదిరదిర తిరుగుచుండె;
సంద్ర మపుడు చిమ్మి రేగి
జల్లుల కురిపించుచుండె.

పకపకమని నవ్వుకొనుచు,
ఎకసక్కెము లాడుకొనుచు,
దేవతలును రక్కసులును
తెగబడి మథియించినారు.

తెరలి తెర్లి పాలవెల్లి
నురుగులతో తెట్టగట్టె;
కలగబాఱి పాలవెల్లి
నిలుకడతో నిట్టనిలిచె.

అమృత మెపుడు పుట్టునొ యని
ఆత్రముతో వారందఱు
పట్టుదలను విడువకుండ
పంతమ్మున చిలికినారు.

అంతలోన పాలవెల్లి
అడుగునుండి విషము వెడలి,
భుగభుగమని దానితోడ
పొగ లెగసెను, సెగ లెగసెను!

విష వహ్నుల కాగలేక
విలవిలమని తన్నుకొనుచు,
వాసుకి నట వదలిపెట్టి
వారందఱు పరుగెత్తిరి!

విషమొక పెనుభూతమగుచు
వెంబడించెనని, వారలు
వెనుక చూపు లేకుండగ
వేగముగా పరుగెత్తిరి!

అలాగున పఱచి వారు
కైలాసము చేరినారు;
పరమ శివుని కాళ్ళమీద
పడి సాగిలి మ్రొక్కినారు!

"హరహరహర! మహాదేవ!
కరుణింపుము సాంబశివా!
పాలవెల్లిలో పుట్టిన
హాలహలము మాన్పు, శివా!"

అని వారలు ప్రార్థించిన
ఆనందము పొంది శివుడు,
"విషము బట్టి భక్షింతును,
విశ్వము రక్షింతు,"ననెను.



పార్వతి నొడ బఱచి శివుడు
పాలకడలి కరుదెంచెను,
వినువీధికి పొంగులెత్తు
విషవహ్నుల పరికించెను.

శివు డప్పుడు మేను పెంచి,
చేయి సాచి హుంకరించి,
విషపు ముద్ద నొడిసిపట్టి
వెన్నను వలె కబళించెను.

కడుపున పడకుండ విషము
కంఠమందు గదియించెను.
"జేజే శ్రీకంఠ!" యనుచు
శివు నెల్లరు స్తుతియించిరి.

తన యెదుటను నాట్యమాడు
పెనుబాముల పైన శివుడు
గొంతుకలో నిలుపుకొన్న
కొంత విషము నుమిసిపోయె.

ఆ ఉమ్మిని తిని పాములు
అతని వెంట బడి పోయెను—
నాటినుండి సర్పములకు
నోట చేదు విషమాయెను.

ఇంద్రాదులు ఆటుపిమ్మట
ఈశ్వరానుమతిని పొంది,
క్షీర సాగరమును మరల
చేరి తరువ సాగినారు.

అంతలోన కామధేను
వను నొక తెలుపైన ఆవు
ఆ సంద్రమునందు పుట్టి
హంసవోలె పయికి లేచె.

అటనుండిన దేవమునులు
ఆ యావును చూచి, తమకు
దానముగా ఒసగుడనుచు
దనుజుల ప్రార్థించినారు.

"ఆ వక్కఅలేదు మాకు
అమృత మొకటె కావలయును,"
అని రక్కసు లా యావును
మునులకిచ్చి పంపినారు.

వారందఱు కలసి మరల
క్షీరాబ్ధిని చిలుకుచుండ,
తెల్ల గుఱ్ఱ మొకటి తేల
దితి కొడుకులు ఉప్పొంగిరి.

"బలే గుఱ్ఱ మేతెంచెను!
బలిరాజున కర్హెంతము,"
అని దైత్యులు పలుకుచుండ
విని దేవత లూరకొనిరి. —(సశేషం)






# 10

[చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ తమ అనుచరులతో కపిలపురం కోటను వశపరుచుకుని, చీకటికొట్లో బంధించబడివున్న కపిలపురం రాజు వీరసింహుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు. ద్రోహి నాగవర్మ ఎక్కడ? అని వీరసింహుడు ప్రశ్నించాడు. అతణ్ణి పట్టుకునేందుకు తన సేనానాయకుణ్ణి పంపినట్టు చిత్రసేనుడు ఆయనతో చెప్పాడు. తరవాత—]

చిత్రసేనుడి మాటలు వింటూనే వీరసింహుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. అతడు ఉగ్రాక్షుడికేసి ఓమారు చూసి, చిత్రసేనుడికేసి తల తిప్పుతూ, "ఈ ఉగ్రాక్షుడికీ నీకూ వున్న సంబంధం యజమానీ సేవకులమధ్య వుండే సంబంధంలాటిదని నేను వినలేదు. నాకు వచ్చిన వర్తమానం మరొకటి. అందువల్లనే, నాగవర్మ ద్రోహం చేయనున్నాడని ముందుగా తెలిసికూడా, పొరుగురాజువైన నీ సహాయం కోరలేకపోయాను," అన్నాడు.

"అవును మహారాజా! ఉగ్రాక్షుడు మాట్లాడే ధోరణి కొన్ని అపోహలకు కారణం అయింది. మీ కుమార్తెకూడా అలాంటి అపోహకే గురి అయింది," అన్నాడు చిత్రసేనుడు.

అతడి మాటలకు కాంతిమతి చిరునవ్వు నవ్వింది. ఉగ్రాక్షుడిలో చలనం లేదు. అతడు స్థాణువులా వీరసింహుడికేసి చూస్తూ వుండిపోయాడు. వీరసింహుడు ఓ క్షణకాలం ఏదో ఆలోచిస్తున్నవాడిలా వూరుకుని, తరవాత ఉగ్రాక్షుడితో, "చిత్రసేనుడు





నాగవర్మ పేరు వింటూనే వీరసింహుడు ఉలిక్కిపడ్డాడు. చిత్రసేనుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అతడికి ఆ క్షణంలో అనేక అనుమానాలు కలిగినై. నాగవర్మ ధవళగిరిని జయించి తిరిగి యిక్కడికి వస్తున్నాడా? అలా కాక అక్కడ జరిగిన యుద్ధంలో ఓడిపోయి యిక్కడికి పారిపోయి రావటం జరిగితే, తను సైన్యాలతో పంపిన తన సేనానాయకుడు ఎక్కడ వున్నట్టు? ఏది ఏమైనా తను వెంటనే కోట రక్షణకు పూనుకోవటం అవసరం!

"ఉగ్రాక్షా! నువ్వు నీ సేవకులతో కోట ద్వారాలను కాపాడు. బురుజులమీద రక్షణకు కొంతమంది విలుకాళ్ళను వుంచటం మంచిది. అమరపాలుడెక్కడ?" అన్నాడు చిత్రసేనుడు.

"ఆయన స్వయంగా శత్రుసైన్యాల బలం ఏపాటో చూసేందుకు అడవిలోకి వెళ్ళాడు," అని సైనికులు జవాబు చెప్పారు.

"ఉగ్రాక్షా, యిక నువ్వు నీ సేవకులతో కోట ద్వారాలను..." అని చిత్రసేనుడు చెప్పబోయేంతలో, ఉగ్రాక్షుడు బిగ్గరగా నవ్వి, "మహారాజా! ఇంక కోటకు ద్వారాలూ బురుజులూ ఎక్కడ వున్నవి? ఇప్పుడు కోటగోడల్లో ఎక్కడ చూసినా ద్వారాలే.

చెప్పినదాంట్లో అబద్ధం ఏమీ లేదుకదా, ఉగ్రాక్షా?" అన్నాడు.

"చిత్రసేన మహారాజు చెప్పినదంతా నిజం. ఆయన వివాహం ఆడి, ఎప్పుడు మహారాణిని తెచ్చుకుంటాడా అని నేను ఎదురు చూస్తున్నాను," అన్నాడు ఉగ్రాక్షుడు.

వీరసింహుడు సిగ్గుతో తల వంచుకున్న తన కుమార్తెతో ఏమో అనబోయేంతలో యిద్దరు సైనికులు రొప్పుతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చి, "మహారాజా! నాగవర్మ పెద్ద సైన్యంతో మన కోటను సమీపిస్తున్నాడు," అని చెప్పారు.



నా సేవకులు గునపాలతో గోడ అంతా కన్నాలు వేశారు. కొన్నిచోట్ల గోడను పునాదులతో కూడా ఎత్తివేశారు. ఇక బురుజులంటారా? అవన్నీ రాళ్ళూ రప్పలుగా కింద భూమిమీద చెల్లాచెదురై వున్నవి. మనం కోటను వశపరుచుకునేందుకు చేసిన భీభత్సం మీరు గమనించినట్టు లేదు," అన్నాడు.

"అలాగా," అంటూ చిత్రసేనుడు ఆశ్చర్యపోయాడు. "మనం చిక్కులో పడ్డాం. శత్రువులు మనను అన్నివైపుల నుంచీ ఎదుర్కోవచ్చు. నాగవర్మ యింత త్వరలో ధవళగిరి వద్ద విజయం సంపాయించి యిక్కడికి తిరిగి వస్తాడని నేను వూహించలేదు," అన్నాడు.

అంతలో అమరపాలుడు అక్కడికి పరిగెత్తుకుని వస్తూ, "ఆ ద్రోహి విజయుడై యిక్కడికి రావటంలేదు మహారాజా, పారిపోయి వస్తున్నాడు. అతడి వెంట వున్న సైన్యంకూడా ఏమంత పెద్దది కాదు. ఆ సైన్యాన్ని వెన్నాడి వస్తూ, దూరంగా కొండల్లో మరొక సైన్యం కనిపించింది. ఆ సైన్యం బహుశా మీ తండ్రిగారిదిగానీ, లేక మీరు సహాయం పంపిన మన సేన గానీ అయి వుంటుంది," అన్నాడు



అమరపాలుడి మాటలు వింటూనే ఉగ్రాకుడు భవనం ప్రతిధ్వనించేలా నవ్వాడు. చిత్రసేనుడికి ఎక్కడ లేని ఆనందం కలిగింది. అతడు అమరపాలుడితో, "అమరపాలా, నువ్వు సైనికులందర్నీ ఒకచోట చేర్చి, నాకోసం వేచివుండు. ఆ ద్రోహిని కోట ముందు మైదానంలోనే సర్వనాశనం చేద్దాం," అన్నాడు.

"నాకొక మంచి యోచన కలిగింది, మహారాజా! మీరు అనుమతించితే చెపుతాను." అన్నాడు ఉగ్రాకుడు.

"త్వరగా చెప్పు. ఏమిటది?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.





"అదీ నిజమే!" అంటూ చిత్రసేనుడు ఓ క్షణకాలం ఆలోచిస్తూ పూరుకుని తర వాత ఉగ్రాక్షుడి కేసి తిరిగి, "ఒకసారి ఆ శత్రు సైనికుల్ని కోట ఆవరణలోకి ప్రవే శించనిస్తే, వాళ్ళల్లో కొందరైనా రాజ ప్రాసాదంలోకి జొరబడే ప్రమాదం కలగ వొచ్చుగదా?" అని అడిగాడు.

"అలాంటి చిక్కు రాకుండా చూసే బాధ్యత నాది, మహారాజా! నా రాక్షస బంట్ల బలం మీకు సొంతం తెలీదు. ఆ నాగవర్మను ఎలాగైనా చేజిక్కించుకుని బలిపెడితే తప్ప లేకపోతే, ఈ ప్రాంతాలకు శాంతి వుండదు. వాడు మనకు దొరక్కుండా పారిపోయాడో, వాడు ఎప్పటికీ మనకు పక్కలో బల్లెమే!" అన్నాడు ఉగ్రాక్షుడు.

"బాగా చెప్పావు ఉగ్రాక్షా!" అంటూ వీరసింహుడు అతణ్ణి మెచ్చుకుని, చుట్టూ వున్న సైనికులతో, "మీలో ఎవరైనా సరే, ఆ ద్రోహి నాగవర్మను ప్రాణాలతో పట్టి నాకు ఒప్పచెపితే అర్ధరాజ్యం యిస్తాను. తల తెచ్చినవాడికి వెయ్యి బంగారు కాసులు యిస్తాను," అన్నాడు ఉద్రేకంగా.

"అర్ధరాజ్యమా?" అంటూ రాజకుమారి కాంతిమతి ఆశ్చర్యపోయి, తన తండ్రికేసి చూసింది.

"నాగవర్మను తన అనుచరులతో కోట లోకి అడుగు పెట్టనివ్వటం మంచిది. ఆ తర వాత అతణ్ణి చుట్టుముట్టి, ఒక్కొగానొక్క శత్రువైనా పారిపోకుండా మట్టుపెట్టవచ్చు," అన్నాడు ఉగ్రాక్షుడు.

"ఇది మంచి ఉపాయమే మహారాజా! వెనకనుంచి తనను సైన్యాలు తరుముతున్న వని ఆ ద్రోహికి తెలియంది కాదు. ఈ కోట తనకు రక్షణ యివ్వగలదని అతడు యిక్క డికి పారిపోయి వస్తున్నాడు. ఇది మన అధీ నంలో వుందని అతడు గ్రహించినప్పుడు, మనకు దొరక్కుండా మరెటువైపుకైనా పారిపోవచ్చు," అన్నాడు అమరపాలుడు.



"అవును అర్ధరాజ్యమే! ఆ ద్రోహి నన్ను అసమర్థుణ్ణి చేసి యింతకాలంగా రాజ్యాన్ని అల్లకల్లోలపరచటమే గాక, నన్ను ఈ చీకటి కొట్లో బంధించి నానా హింసలపాలూ చేశాడు," అన్నాడు వీరసింహుడు.

"అయితే, కోటలో పురుగు వున్నట్టు కూడా ఆ నాగవర్మకు తెలియకూడదు. సైనికులందర్నీ వారివారి స్థానాల్లో దాచి వుంచి, వాడు సైన్యంతో కోటలో ప్రవేశించగానే ఒక్కుమ్మడిగా మీద పడి అందర్నీ యమపురికి ప్రయాణం కట్టించాలి," అన్నాడు చిత్రసేనుడు.



"అవును మహారాజా! ఆ పని, నాకూ అమరపాలుడికీ వదలండి. మీరూ, వీరసింహ మహారాజుగారూ, రాజకుమారీ భవనంమీద ఎక్కడైనా వుండి, మా ప్రతాపం తిలకించండి," అంటూ ఉగ్రాక్షుడు, తన సేవకులకేసి తిరిగి, "ఒరే, బంట్లూ, ఎక్కడ?" అని హుంకరించాడు.

అమరపాలుడీ, ఉగ్రాక్షుడీ నాయకత్వంలో సైనికులూ, రాక్షసులూ కోట లోపలి భవనాల వెనకా, చెట్లచాటునా దాగి వుండే ప్రయత్నాలు చేస్తూండగా, కోట సమీపంలోని అడవిని చేరిన నాగవర్మ, గుర్రంమీద లేచి నిలబడి కోట బురుజులకేసి చూస్తూ, "కరవీరా! మనం వూహించిందే నిజమయింది. శత్రువులు కోటమీద పడి నానా భీభత్సం చేసి ఎటో వెళ్ళిపోయారు," అంటున్నాడు.

ఈ కరవీరుడనేవాడు జ్వాలాద్వీపం నుంచి వచ్చిన పులిరాయుళ్ళ నాయకుడు. నాగవర్మ వెంట కొందరు అనుచరులతో ధవళగిరిమీదికి దాడి వెళ్ళి, అక్కడ చిత్రసేనుడి తండ్రి అయిన తారకేశ్వర మహారాజువల్ల చావుదెబ్బలు తిని, కపిలపురం కోటకు పారిపోయి వస్తున్నాడు.

"అవును, మహారాజా! మీరు చెప్పింది నిజం. శత్రువులు కోటలో వున్న మన భటు





లను ఓడించి, దాన్ని ఆక్రమించుకున్నట్టు తెలుస్తూనే వున్నది. కాని, ఇప్పుడు ఎక్కడా ఒక్క శత్రు సైనికుడైనా వున్నట్టు లేదు. కోటలో వున్నదంతా దోచుకుని వాళ్లు తిరిగి చిత్రసేనుడి రాజధానికి వెళ్లివుంటారు. నాకు కలిగే ఆశ్చర్యం అల్లా, నా అనుచరులూ, ఆ రెండు భయంకర పక్షులూ ఏమయా యని!" అన్నాడు కరవీరుడు.

"నేను పడే ఆశ్చర్యం అదికాదు; కోట లోని చీకటి గదిలో బంధించబడిన ముసలి రాజు వీరసింహుడు ప్రాణాలతో శత్రువులకు చిక్కాడేమో అని. అలా జరిగితే మనకు ముందుముందు ప్రమాదం కూడా. ఏది ఏమైనా మనం కోటలో ప్రవేశించి, తారకేశ్వరుడి సైన్యాలు వచ్చేలోపల రక్షణలను బల పరుచుకోవటం క్షేమం. కోట గోడల్ని రక్షణగా పెట్టుకుని, మనం శత్రువులను ఎంత కాలం అయినా ఎదిరించి నిలబడవచ్చు," అన్నాడు నాగవర్మ.

ఆ తరవాత నాగవర్మా, కరవీరుడూ తమ తమ అనుచరులకు హెచ్చరికలు చేశారు. "మనను వెనకనుంచి శత్రువులు తరుముకు వస్తున్నారు. అసంఖ్యాకులైన వాళ్ళ చేతుల్లో పడి చావకుండా తప్పించుకోవాలంటే, మనకు కపిలపురం కోట ఒక్కటే రక్షణ యివ్వగలదు. ఊఁ కదలండి!" అంటూ నాగవర్మ కేకలుపెట్టాడు.

నాగవర్మా, కరవీరుడూ గుర్రాలమీద ముందు బయలుదేరారు. వారికి వెనకగా కాల్బటులూ, వాళ్ళ వెనక మరికొందరు గుర్రపురౌతులూ కదిలారు. ఓ పావుగంట గడిచేసరికి అందరూ కోట గోడల ముందున్న మైదానం చేరారు. నాగవర్మా, కరవీరుడూ సైన్యాలను ఆగమని హెచ్చరించి, కూలి పోయిన కోట ముఖద్వారాల దగ్గిరకు వెళ్ళి లోపలికి తొంగి చూశారు. లోపల అంతా నిశ్శబ్దం. చీమ చిటుక్కుమన్నా వినబ డేంత నిశ్శబ్దం.



"ఇందులో ఏమయినా మోసం లేదు గదా?" అన్నాడు నాగవర్మ.

"మోసం ఏముంటుంది? కోటలో వున్న నగా నట్రా దోచుకుని శత్రువులు-వాళ్లదారిన వాళ్ళు వెళ్లారు. వాళ్లకు కావలసిన ముసలి రాజు వీరసింహుడు కూడా వాళ్ళకు దొరికి వుంటాడు," అన్నాడు కరవీరుడు.

"మన సైనికుల్లో కొందరైనా యుద్ధంలో చచ్చివుంటారుగదా? కాని ఒక్కడి శవం కూడా కనిపించటంలేదు. శవాలు కూడా ఎలా మాయమయినై? ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లను తేలేదుగదా?" అన్నాడు నాగవర్మ.

నాగవర్మ యిలా అనేసరికి పులిరాయుళ్ల నాయకుడు కరవీరుడికి గుండెబలం జారింది. వాడికి ఉగ్రాక్షుడి రాక్షసులంటే ఎక్కడ లేని భయం.

"మహారాజా, ఎందుకైనా మంచిది ఒక పని చేద్దాం," అన్నాడు వాడు, గుర్రాన్ని ముందుకు నడిపి, రహస్యం చెప్పేవాడిలా నాగవర్మకేసి మెడ వంచి.

"ఏమిటదీ?" అని అడిగాడు నాగవర్మ అనుమానంగా.

"కోట ఇంత నిర్జనంగా, నిశ్శబ్దంగా వుండటం నాకు ఆశ్చర్యమేకాక అనుమానం కూడా కలిగిస్తున్నది. ఆ రాక్షసులూ వాళ్ళ నాయకుడూ మనకోసం ఏదైనా మాటు వేశారేమోనని నా భయం. అట్లని మనకు రక్షణ యిచ్చే ఈ కోటను ఆక్రమించుకోకుండా వదిలి పోవటం ప్రమాదకరం. మనను వెన్నంటి వచ్చే తారకేశ్వరుడి సైన్యాలు మనను ఈ అడవిలో మృగాలను వేటాడినట్టు వేటాడగలవు. కనుక, మనం కోటలో ముందు ప్రవేశించకుండా, మన సైనికులను ముందు ప్రవేశపెట్టి, ఏమి జరుగుతుందో చూసి, ప్రమాదం లేకపోతే, వెనగ్గా మనం కోటలో జొరబడవచ్చు," అన్నాడు కరవీరుడు. —(ఇంకావుంది)





# నాగానందం

జీమూతకేతువు అనే విద్యాధర రాజుకు జీమూతవాహనుడనే కుమారుడుండేవాడు. జీమూత కేతువు ముసలివాడై తన భార్యతో సహా అరణ్యాలలో తపస్సు చేసుకోబోతూ తన కుమారుడైన జీమూతవాహనుడికి రాజ్యాభిషేకం చేసి వనానికి వెళ్లాడు. కాని జీమూతవాహనుడికి రాజ్యభోగా లనుభవించటంకంటె తానుకూడా వనవాసం చేస్తూ తల్లిదండ్రుల సేవ చెయ్యటమే ఆనందదాయకంగా కనబడింది. అందుచేత అతనుకూడా వనవాసమే అవలంబించి తల్లిదండ్రుల వెంట ఉండిపోయాడు. రాజ్యభారమంతా మంత్రులపైన పడింది.

ఒక వనంలో కొంతకాలం ఉన్నాక ఆ ప్రాంతంలో కందమూలాదుల కరవు ఏర్పడింది. అందుచేత ముసలిరాజు తన కుమారుడితో మలయ పర్వత ప్రాంతాన మంచి ఆశ్రమం చూసి రమ్మని చెప్పాడు. జీమూతవాహనుడు తన చెలికాడైన ఆత్రేయుడనే బ్రాహ్మణ్ణి వెంటపెట్టుకుని మలయప్రాంతంలోని గౌర్యాశ్రమానికి వచ్చాడు. వారిద్దరూ గౌరీ ఆలయం సమీపించే సమయానికి ఆలయంలో ఎవరో యువతి వీణ వాయిస్తూ మహా శ్రావ్యంగా దేవీ సంకీర్తన చేస్తూ ఉండటం వినిపించింది.

ఆ సమయంలో ఆలయంలో దేవిని ఆరాధిస్తున్న చిన్నది విశ్వావసువు అనే విద్యాధరుడి కుమార్తె, మిత్రావసువు అనేవాడి చెల్లెలు. ఆమె పేరు మలయవతి. ఆమె గానానికి ముగ్ధుడై జీమూతవాహనుడు ఆలయం వెలపలినుంచి పాట ఆలకించసాగాడు. అయితే మధ్యలో ఆలయంనుంచి సంభాషణ వినిపించింది: "కన్యక అయిన ఈ దేవిని ఎంత ఆరాధించి ఏంలాభమమ్మా! ఈమె నీకు తగిన భర్తను ఇవ్వబోదు!" అని మలయవతితో ఆమె చెలికత్తె అన్నది.

ఈ సంభాషణనుబట్టి గానంచేసే మనిషి పెళ్ళికానిదనీ, ఆమెను చూడటం తప్ప కాధనీ గ్రహించి జీమూతవాహనుడు అల యంలో ప్రవేశించాడు. అప్పుడు మలయ వతీ జీమూతవాహనులు ఒకరినొకరు చూసు కుని ప్రేమించుకున్నారు.

మలయవతి సిగ్గువేత అతిథిసత్కారం కూడా చేయలేకపోయింది. ఇంతలో ఇంటి నుంచి ఆమెకు పిలుపుకూడా వచ్చింది.

తరవాత జీమూతవాహనుడు తన తల్లి దండ్రులను గౌర్యాశ్రమానికి చేర్చాడు.

జీమూతవాహనుణ్ణి చూసినది మొదలు మలయవతి ప్రేమతో తపించిపోతోంది. ఒక నాడు ఆమె శైత్యోపచారాలకుగాను చెలి కత్తెతోసహా చందన లతాగృహానికి వెళ్లింది. అక్కడ చెలికత్తె ఆమెకు చందనపు చిగుళ్ల పసరు పూసి అరటి ఆకుతో విసురుతూ ఉండగా జీమూతవాహనుడు తన చెలికా డైన ఆత్రేయుడితో సహా అక్కడికే వచ్చాడు. అక్కడ ఉండే పాలరాతి అరుగును వదలి స్త్రీలిద్దరూ చెట్లచాటుగా, ఇంకా లోపలికి వెళ్ళిపోయారు.

అక్కడ మగవాళ్ళ సంభాషణనుబట్టి జీమూతవాహనుడు ఎవతెనో ప్రేమించి బాధ పడుతున్నట్టు స్పష్టమయింది. ఆ స్త్రీ ఎవతో మలయవతికి తెలియలేదు. జీమూతవాహ



నుడు తాను ప్రేమించిన స్త్రీ రూపాన్ని అరుగుపైన రచించాడు. అది మలయవతికి కనిపించలేదు. తాను ఇంతగా ప్రేమించే జీమూతవాహనుడు మరెవతెనో ప్రేమిస్తున్నా డనుకుని ఆమె ఈర్ష్య చెందిందికూడా.

ఇంతలో జీమూతవాహనుణ్ణి వెతుకుతూ మలయవతి అన్న మిత్రావసువు అక్కడికి వచ్చాడు. జీమూతవాహనుడు తాను చిత్రించిన బొమ్మను అరటి ఆకుతో కప్పి మిత్రావసువుతో మాట్లాడాడు.

"మా నాన్నగారు నా చెల్లెలైన మలయవతిని నీకిచ్చి పెళ్ళిచెయ్యాలని ఉన్నట్టు చెప్పమన్నారు," అన్నాడు మిత్రావసువు.

"మీతో సంబంధం చేసుకోవటం చాలా గొప్ప విషయమేగాని, నా మనస్సు మరొక చోట లగ్నం అయి ఉండటంచేత నేని సంబంధానికి ఒప్పుకోలేను," అన్నాడు జీమూతవాహనుడు. తాను ప్రేమించే స్త్రీ మలయవతేనని అతనికి తెలియదు.

జీమూతవాహనుడి ఈ మాటలు వింటూనే మలయవతి మూర్ఛపోయింది.

"ఇతను పెళ్ళికి ఒప్పుకునేదేమిటి? ఇతని తండ్రిచేత చెప్పిస్తే తప్పక ఒప్పుకుంటాడు!" అనుకుంటూ మిత్రావసువు వెళ్ళిపోయాడు.

ఈలోపల చెలికత్తె చేసిన సపర్యలతో మలయవతి మూర్ఛ తెలిసి, "మా అన్న





ఇంకా ఉన్నాడో, వెళ్ళాడో చూసి రావే!" అని చెలికత్తెను పంపేసి, అక్కడ ఉన్న తీగతో ఉరి పోసుకోవటానికి యత్నించింది. మలయవతి మనస్థితి తెలుసుకున్న చెలికత్తె చాటున ఉండి ఈ సంగతి చూసి, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టింది. పక్కనే ఉన్న జీమూతవాహనుడు పరిగెత్తుకుంటూ వచ్చి మలయవతి మెడ చుట్టూ ఉన్న తీగెను లాగివేశాడు.

తరవాత జరిగిన సంభాషణలో అపోహలన్నీ విచ్చిపోయాయి. తనకు మిత్రావసువు ఇస్తానన్న మలయవతి తాను ప్రేమించిన మనిషేనని జీమూతవాహనుడు తెలుసుకున్నాడు; అరిటి ఆకు ఎత్తి అరుగుపైనున్న చిత్తరువును చూపించేసరికి, జీమూతవాహనుడి ప్రేయసి తానే అయినట్టు మలయవతి కూడా తెలుసుకున్నది.

వారిద్దరికీ త్వరలోనే యథావిధిగా వివాహం జరిగింది.

ఆ సమయంలోనే మిత్రావసువు తన కొత్త బావమరిదికి ఒక దుర్వార్త తెచ్చి వినిపించాడు: మతంగుడనే శత్రువు జీమూతవాహనుడి రాజ్యాన్ని కాస్తా కాజేశాడు.

"ఇంతపని చేసిన ఆ మతంగుణ్ణి ఇప్పుడే వెళ్ళి చించి చెండాడేస్తాను. నాకు అనుమతి ఇయ్యి," అన్నాడు మిత్రావసువు.

"మరొకరికోసం నా ప్రాణాలనైనా ఇవ్వాలన్నది నా మతమై ఉండగా, ఇంకొకరిని చంపి రమ్మని నేను ఎలా అనగలను?" అంటూ జీమూతవాహనుడు మిత్రావసువుకు అహింసాధర్మబోధ చేశాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు మిత్రావసువూ, జీమూతవాహనుడూ కలిసి మలయ పర్వత ప్రాంతంలోని సముద్రతీరానికి సముద్రపు పోటు చూడ వెళ్ళారు.

"ఆహా, ఆ కొండలు చూడు, తెల్లగా హిమాలయ శిఖరాలులాగా ఉన్నాయి!" అన్నాడు జీమూతవాహనుడు.



"అయ్యో, అవి మలయసానువు లను కుంటున్నావేమిటి? కావు, పాముల అస్థి రాసుల గుట్టలు," అన్నాడు మిత్రావసువు.

"ఇన్ని పాములు ఎలా చావటం జరిగింది?" అని జీమూతవాహనుడు అడిగాడు.

"పూర్వం గరుత్మంతుడు ఇక్కడికి వచ్చి తన రెక్కల గాలిచేత సముద్రపు నీటిని తోసివేసి, అడుగున ఉండే పాములను పట్టుకుపోయి భక్షించేవాడు. అప్పుడు నాగరాజైన వాసుకి గరుత్మంతుడితో, రోజుకొక నాగుణ్ణి బలి ఇచ్చి, మిగిలిన పాములకు అకారణ భయం లేకుండా ఉండేటట్టు ఒప్పందం చేసుకున్నాడు!" అని మిత్రావసువు చెప్పాడు.

"అయ్యో, వాసుకికి వెయ్యితలలూ, రెండువేల నాలుకలూ ఉన్నాయే, అందులో ఒక్క నాలుక అయినా, 'ఓ గరుత్మంతుడా, ఇవాళ నన్ను తిని ఒక్క నాగుడి ప్రాణం కాపాడు!' అనలేకపోయిందా?" అన్నాడు జీమూతవాహనుడు.

అతను తనలో, "నా దేహం గరుత్మంతుడికి ఆహారంగా ఇచ్చి ఒక్క నాగుడి ప్రాణం కాపాడే అవకాశం దొరికితే నేనెంత ధన్యుణ్ణి!" అనుకున్నాడు. ఇంతలో అక్కడికి ఒక నౌకరు వచ్చి మిత్రావసువుతో, "మిమ్మల్ని మీ తండ్రిగారు రమ్మంటున్నారు!" అని చెప్పాడు. మిత్రావసువు జీమూతవాహనుడితో, "ఇది అపత్కారమైన చోటు, ఎక్కువసేపు మసలక త్వరగా వచ్చెయ్యి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

"లేదు, నీటిదాకా వెళ్ళి వచ్చేస్తాను," అంటూ జీమూతవాహనుడు సముద్రతీరానికేసి కదిలాడు. ఇంతలో అతనికి, "అయ్యో, నాయనా! శంఖచూడా! నీ చావు చూడవలిసిన గతి పట్టిందా నాకు?" అన్న రోదనం వినిపించింది.

ఆ సమీపంలోనే వధ్యశిల ఉన్నది. ఆ రోజు గరుత్మంతుడికి ఆహారం కావటం

శంఖచూడుడనే నాగుడి వంతు. వాడి తల్లి ముసలిది. ఆమెకు వాడు ఒక్కడే కొడుకు. వధ్యచిహ్నమయిన ఎర్ర బట్టలను పట్టుకుని శిలవద్ద కింకరుడొకడున్నాడు. ఆ బట్టలు కట్టుకుని శిలపైన పడుకుంటే గరుత్మంతుడు వచ్చి తిని పోతాడు.

శంఖచూడుడు చావటానికి సంసిద్ధుడై ధైర్యంగానే ఎర్ర బట్టలు తీసుకున్నాడు. కాని వాడి తల్లి కడుపు పగిలేటట్టు ఏడుస్తున్నది. వాడు ఆమెను సముదాయించలేకుండా ఉన్నాడు. ఈ సమయంలో జీమూతవాహనుడు అక్కడికి వచ్చి సంగతంతా గ్రహించాడు. పుత్రశోకంతో మతిపోయి ఉన్న ముసలిది జీమూతవాహనుడి కాళ్ళపైన పడి, "ఓ గరుత్మంతుడా, ఇవాళ నాగరాజు నీకు నన్నే ఆహారంగా పంపాడు. నన్ను తిను!" అని ఏడ్చింది. ఆమె స్థితి చూసి జీమూతవాహనుడి గుండె కరిగిపోయింది.

"అమ్మా, నేను గరుత్మంతుణ్ణి కాను. ఆ ఎర్ర బట్టలు నాకిచ్చినట్టయితే నేను గరుత్మంతుడికి ఆహారమై నీ కొడుకు ప్రాణాలు కాపాడుతాను," అన్నాడు జీమూతవాహనుడు.

"అంతమాట అన్నవాడివి నాకు శంఖచూడుడికన్న ఎక్కువైనవాడివి, నాయనా! అటువంటి పనికి ఒప్పుకోను!" అన్నది



ముసలిది. జీమూతవాహనుడు ఎన్నివిధాల చెప్పినా శంఖచూడుడు కూడా ఎర్ర బట్టలు ఇయ్యలేదు. గరుత్మంతుడు వచ్చే సమయం దగ్గిర పడిందని శంఖచూడుడు గోకర్ణేశ్వరుడికి ప్రదక్షిణం చేసి రావటానికి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. తల్లికూడా వాడి వెంట వెళ్ళింది.

సరిగా ఆ సమయానికి మలయవతి తల్లి ఒక నౌకరుచేత జీమూతవాహనుడికి ఇవ్వమని ఎర్రబట్టలు పంపింది. జీమూతవాహనుడు వాటిని సంతోషంతో తీసుకుంటూ, "నువు పద! అమ్మగారికి నా నమస్కారాలు చెప్పు!" అన్నాడు. చిత్తమంటూ నౌకరు వెళ్ళిపోయాడు. జీమూతవాహనుడు ఆ ఎర్ర బట్టలు ధరించి వధ్యశిలపైన పడుకున్నాడు. ఇంతలో గరుత్మంతుడు వచ్చి జీమూతవాహనుణ్ణి పట్టుకుని, తినటానికై మలయపర్వత శిఖరంపైకి తీసుకుపోయాడు.

ఈలోగా జీమూతవాహనుడి కోసం అత్త వారింటినుంచి ఒక నౌకరు జీమూతకేతుడి ఇంటికి వచ్చాడు. అతను అక్కడా ఇక్కడా కూడా లేనట్టు స్పష్టమయింది. ఇంతలో జీమూతవాహనుడి చూడామణి ఆకాశం నుంచి నెత్తుటితో తడిసి ఆ సమీపంలో పడింది. దానిని జీమూతవాహనుడి తల్లి గుర్తించింది.



ఆ సమయానికే ఏడుస్తూ, ఎఱ్ఱబట్టలతో శంఖచూడుడు అటుగా వచ్చాడు. వాడి మాటలను బట్టి జీమూతవాహనుడు గరుత్మంతుడికి ఆహారమైనట్టు స్పష్టమయింది. జీమూతకేతువూ, ఆయన భార్యా, మలయవతీ కూడా అగ్నిప్రవేశం చెయ్యటానికి నిశ్చయించుకున్నారు.

"నేను ముందుగా వెళ్లి ఆ గరుత్మంతుణ్ణి కలుసుకుంటాను. మీరు అగ్ని తీసుకుని రండి," అంటూ శంఖచూడుడు బయలు దేరాడు. గరుత్మంతుడు జీమూతవాహనుణ్ణి ఒకవంక పీక్కు తింటూనే అతనిలో భయాందోళనలు లేకపోవటమూ, ముఖాన సంతోష చ్ఛాయలూ గమనించి, "ఎవరయ్యా, నువ్వు?" అని అడిగాడు.

"ఆకలిమీద ఉన్నావు. ముందు నీ కడుపు నించుకో!" అన్నాడు జీమూతవాహనుడు. ఇంతలో శంఖచూడుడు, "గరుత్మంతుడా, వదులు, వదులు! అతను నాగుడు కాడు. నన్ను భక్షించు!" అంటూ పరిగెత్తుకుని వచ్చాడు.

ఇద్దరు ఎఱ్ఱబట్టలవాళ్ళను చూసేసరికి గరుత్మంతుడికి ఎవరు నాగుడో తెలియలేదు. శంఖచూడుడు తన పడగలు చూపాడు. తాను తింటున్నది విద్యాధరుడని తెలిసి గరుత్మంతుడు చాలా నొచ్చుకున్నాడు. అతనికి పశ్చాత్తాపం కలిగింది, కాని ప్రాయశ్చిత్తం తెలియలేదు. ఎన్నటికీ జీవహింస చేయవద్దని జీమూతవాహనుడు గరుత్మంతుడికి ఉపదేశం చేశాడు.

గరుత్మంతుడు స్వర్గానికి వెళ్లి అమృతం తెచ్చి జీమూతవాహనుడి పైనా, పాముల ఎముకల గుట్టలపైనా చల్లాడు. జీమూతవాహనుడితోబాటు నాగులందరూ బతికారు. తరవాత జీమూతవాహనుడు తన రాజ్యం పొందటమే గాక విద్యాధరుల కందరికీ చక్రవర్తి అయి మలయవతితోబాటు సుఖంగా రాజ్యపాలన చేశాడు.





# బంగారు కొండ

ఒకప్పుడు రష్యాదేశంలో గ్రీష్కా అనే కాపు కుర్రవాడుండేవాడు. వాడు పొట్టగడవక పార భుజాన పెట్టుకుని కూలి చేసుకునేటందుకు బస్తీకి వచ్చాడు. పెద్ద బజారులో కూలికోసం చూసేవాళ్ళంతా ఒకచోట నిలబడి ఉన్నారు. గ్రీష్కా కూడా వారితో చేరి నిలబడ్డాడు. ఎప్పుడైనా ఒక వర్తకుడు వచ్చి కూలి మనుషులలో ఒకణ్ణి తీసుకుపోవటం జరుగుతూ వచ్చింది. ఎన్నిగంటలు నిలబడినా గ్రీష్కాను ఎవరూ కూలికి పిలుచుకు పోలేదు.

ఇంతలో పెద్ద చప్పుడుతో ఒక బంగారు బండి అటుగా వచ్చింది. దానికి రెండు తెల్లటి గుర్రాలు కట్టి ఉన్నాయి. కూలివాళ్ళందరూ ఆ బండిమీద మూగుతారని గ్రీష్కా అనుకున్నాడు, కాని అలా జరగలేదు. ఆ బండిని అంత దూరాన చూస్తూనే కూలివాళ్ళంతా పారిపోయారు.

గ్రీష్కా ఒక్కడే అక్కడ మిగిలిపోయాడు. అతడికి ఆశ్చర్యం కలిగింది.

బండిలోనుంచి ఒక వర్తకుడు తల బయటికి పెట్టి, 'పని చేస్తావా?' అని గ్రీష్కాను అడిగాడు. అందుకే నిలబడి ఉన్నానన్నాడు గ్రీష్కా. "రోజుకు ఏమివ్వమంటావు?" అని వర్తకుడు అడిగాడు. గ్రీష్కా కొంచెం ఆలోచించి, రోజుకు వంద రూబుళ్ల కూలి ఇవ్వమన్నాడు. "రోజుకు వంద రూబుళ్ళే?" అన్నాడు వర్తకుడు.

"ఎవరన్నా తక్కువకు వస్తే తీసుకుపొండి. తమరు రావటం చూసి కూలివాళ్ళంతా పారిపోవటం నేను గమనించాలెండి," అన్నాడు గ్రీష్కా.

"అయితే రేపు సూర్యోదయం వేళకు రేవు దగ్గిరికి రా. నీ కోసం కనిపెట్టుకుని ఉంటాను," అని చెప్పి వర్తకుడు తన బండిలో వెళ్ళిపోయాడు.

బి. వీరాంజనేయులు

మర్నాడు సూర్యోదయం వేళకు గ్రీష్క రేవు చేరాడు. అక్కడ వర్తకుడి నౌక బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నది. గ్రీష్క ఎక్కగానే నౌక ప్రయాణమయింది. అది చాలా రోజులు సముద్రంపైన పోయి, పోయి చివరకు ఒక లంక చేరింది. లంకలో మంటలు లేస్తున్నట్టుగా గ్రీష్కకు కనబడింది. వర్తకుడితో ఆ మాట చెబితే, "అవి మంటలు కావు. నా బంగారు భవనం ఎండ పడి అలా మెరుస్తోంది!" అన్నాడు.

వర్తకుడి నౌక లంకను చేరగానే ఒడ్డున వర్తకుడి భార్యా, కూతురూ కనిపించారు. వర్తకుడి కూతుర్ని చూసి గ్రీష్కకు ప్రేమ పుట్టుకొచ్చింది. ప్రపంచంలో అంత అందగత్తె ఉంటుందని వాడెన్నడూ వినలేదు. గ్రీష్క కూడా అందమైనవాడు కావటంచేత ఆ పిల్లకూడా వాణ్ణి చూస్తూనే ప్రేమించింది.

ఆ రాత్రి వర్తకుడి బంగారు భవనంలో గొప్ప విందు జరిగింది. "ఈ పూటకు తనివి తీరా తిను, తాగు! రేపు పని ప్రారంభింతాం!" అన్నాడు గ్రీష్కతో వర్తకుడు. ఆ రాత్రి గ్రీష్క మహారాజులు చేసే భోజనం చేశాడు.

భోజనాలయినాక వర్తకుడి కూతురు గ్రీష్కను అవతలికి తీసుకుపోయి, ఒక అగ్గిపెట్టె వాడి చేతిలో పెట్టి, "ఇది ఎప్పుడూ నీదగ్గిరే ఉంచుకో. ఇందులో ఉక్కు



ముక్కు, చెకుముకిరాయీ ఉన్నాయి. ఈ లంకలో నీకు ఏ ప్రమాదం జరిగినా ఉక్కుతో చెకుముకిని కొట్టు, వెంటనే ఆపద తొలగిపోతుంది," అని రహస్యంగా చెప్పింది.

మర్నాడు తెల్లవారి వర్తకుడు గ్రీష్కను వెంటబెట్టుకుని ఒక కొండవద్దకు వెళ్ళాడు. అది బంగారు కొండ. వర్తకుడు గ్రీష్కను కొండ శిఖరానికి ఎక్కమన్నాడు. కాని కొండ చాలా నున్నగా ఉండి కాలికి పట్టు దొరకకపోవటంచేత గ్రీష్క కొండను ఎక్క లేకపోయాడు.

"నీకు బలం చాలటంలేదు. ఈ మందు తాగు," అంటూ వర్తకుడు గ్రీష్కకు ఏదో పానీయం ఇచ్చాడు. అది నోటికి తగిలీ తగలటంతోనే గ్రీష్క స్పృహ తప్పి కింద పడిపోయాడు.

వెంటనే వర్తకుడు తనవెంట తెచ్చిన గుర్రాన్ని చంపి, దాని పొట్టలో గ్రీష్కను పెట్టి కుట్టి, తాను వెళ్ళి పొదలలో దాగాడు. కొద్దిసేపటికి రెండు పెద్ద పక్షులు వచ్చి గుర్రం కళేబరాన్ని తమ గోళ్ళతో పట్టి కొండ శిఖరానికి తీసుకుపోయి, అక్కడ దాన్ని పీక్కు తినసాగాయి. కొద్దిసేపట్లో గుర్రం అస్థి పంజరం మాత్రమే మిగిలింది.

కొంతసేపయాక గ్రీష్క స్పృహ తెలిసి, తాను ఎక్కడ ఉన్నదీ ఊహించలేక,



"ఏమయ్యోయ్, వర్తకుడా, ఎక్కడున్నావు?" అని పొలికేక పెట్టాడు.

"నేను కొండకింద ఉన్నాను. నువు కొండమీద ఉన్నావు. నీ పారతో కొండ పైభాగాన తవ్వి బంగారాన్ని కిందికి దొర్లించు," అని వర్తకుడు నవ్వుతూ సమాధానమిచ్చాడు.

అలాగే గ్రీష్క సాయంకాలందాకా బంగారం తవ్వి కిందికి దొర్లించాడు. వర్తకుడు తన వెంట తెచ్చిన బళ్లన్నీ నిండినాక, "ఇక చాలులే, గ్రీష్క! చాలా ఉపకారం చేశావు. నేను వెళుతున్నాను," అన్నాడు.

"నేనో?" అన్నాడు గ్రీష్క.

వర్తకుడు పెద్దగా నవ్వి, "అక్కడే ఉండిపో. నీవంటివాళ్ళు తొంభైతొమ్మిది మంది అక్కడే దిగబడిపోయారు. నువు నూరోవాడివి!" అని, బళ్ళను తోలుకుని వెళ్లిపోయాడు.

దుర్మార్గుడైన వర్తకుడి మోసం మూలాన తనకా కొండమీద తిండికి మాడి చచ్చే గతి పట్టిందని గ్రీష్క మొదట భయపడ్డాడు; కాని అంతలోనే వాడికి వర్తకుడి కూతురిచ్చిన అగ్గిపెట్టె జ్ఞాపకం వచ్చింది. వాడా పెట్టె తెరిచి ఇనపముక్కతో చెకుముకి రాతిని కొట్టాడు. అందులోనుంచి రెండు రవ్వలు వచ్చాయి. అవి ఇద్దరు యువ



కులుగా మారి, "ఏం కావాలి?" అని గ్రీష్క్రను అడిగాయి.

"నన్ను కిందికి చేర్చండి!" అన్నాడు గ్రీష్క్. మరుక్షణమే వాడు సముద్రతీరాన ఉన్నాడు. కొద్దిసేపట్లో అటుగా ఒక ఓడ వచ్చింది. వాడు కళాసులను బతిమాలి, ఆ ఓడలో ఎక్కి తన దేశానికి తిరిగి వెళ్లాడు.

కొంతకాలం గడిచింది. మళ్ళీ గ్రీష్క్ పార భుజాన పెట్టుకుని పెద్ద బజారులో కూలివాళ్ళతో కలిసి నిలబడ్డాడు. బంగారు బండిలో వర్తకుడు అటుగా వచ్చాడు. ఆ బండిని చూస్తూనే గ్రీష్క్ తప్ప మిగిలిన కూలీలందరూ పారిపోయారు.

వర్తకుడు గ్రీష్క్ నిలబడి ఉన్నచోట బండి ఆపి, బయటికి తొంగి చూసి, గ్రీష్క్రను 'పనిచేస్తావా?' అని అడిగాడు. గ్రీష్క్ చేస్తానన్నాడు.

"రోజుకూలి ఏమి ఇవ్వమంటావు?" అన్నాడు వర్తకుడు గ్రీష్క్రను గుర్తించక.

"రెండువందల రూబుళ్లు ఇప్పించండి," అన్నాడు గ్రీష్క్.

"రెండువందల రూబుళ్ళా? అందులో సగంకంటె నేనెవరికీ ఎన్నడూ ఇవ్వలేదు," అన్నాడు వర్తకుడు.

"ఇష్టమైతే ఇవ్వండి, లేకపోతే ఇంకొర్ని చూసుకోండి. మీరు రావటం చూసి అందరూ



పారిపోయారు, నేను చూశాలే," అన్నాడు గ్రీష్క అమాయకత్వం నటిస్తూ.

"సరే అయితే రేపు సూర్యోదయం వేళకు రేవుకు రా. నీకోసం కనిపెట్టుకుని ఉంటాను," అంటూ వర్తకుడు బండిలో వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం గ్రీష్క వర్తకుడి నౌకలో ఎక్కి లంకకు వెళ్ళాడు. అంతా కిందటిసారిలాగే జరిగింది. ఇద్దరూ బంగారు కొండపద్దకు చేరినాక వర్తకుడు గ్రీష్కను కొండ ఎక్కమన్నాడు. గ్రీష్క ఎక్కలేక పోయాడు.

"ఇదుగో ఈ మందు తాగు, బలం వస్తుంది," అంటూ వర్తకుడు గ్రీష్కకు ఏదో పానీయం ఇచ్చాడు.

"నా దగ్గిరకూడా తాగే పానీయం ఉన్నది. ముందు తమరు తాగండి," అంటూ గ్రీష్క తన సీటి బుడ్డినుంచి వర్తకుడికి కొంత పానీయం ఇచ్చాడు. ఎట్టి అనుమానమూ లేని కారణంచేత వర్తకుడు గ్రీష్క యిచ్చిన పానీయం తాగి స్పృహ తప్పి కింద పడిపోయాడు.

గ్రీష్క ఒక గుర్రాన్ని చంపి, వర్తకుణ్ణి అందులో పెట్టి కుట్టి, తాను వెళ్ళి పొదలలో దాక్కున్నాడు. పక్షులు వచ్చి వర్తకుణ్ణీ, గుర్రాన్నీ కొండ శిఖరంమీదికి చేర్చి, గుర్రాన్ని తినేసి వెళ్ళిపోయాయి. వర్తకుడు గుర్రం అస్థిపంజరంనుంచి బయటికి వచ్చి, "ఒరే, ఎక్కడ ఉన్నావురా?" అని పెద్దగా అరిచాడు.

"తమరు కొండమీద ఉన్నారు. నేను కొండకింద ఉన్నాను. నేను పోతున్నాను. మీరు అక్కడే ఉండండి. ఇప్పటికి తొంభై తొమ్మిదిమంది అయారు. మీరు నూరో వారు!" అని వర్తకుడితో చెప్పి గ్రీష్క వర్తకుడి ఇంటికి తిరిగి వచ్చి, వర్తకుడి కుమార్తెను పెళ్ళాడి, బంగారు భవనంలో ఆమెతో కూడా సుఖంగా ఉన్నాడు.





# వడ్డీతో సహా

ఒక ఊళ్ళో ఒక పేద రైతు ఉండేవాడు. పంటలు పండకా, అప్పులు చేసీ, పంటలు పండినప్పుడు ఫలసాయమంతా వడ్డీకింద చెల్లుగట్టీ ఆ రైతు అడుగంటాడు.

ఆ స్థితిలో వాడు వడ్డీవ్యాపారిదగ్గిరికి వెళ్లి, "ఇదుగో చూడు, నాదగ్గిర నుంచి ఇక నీకు చిల్లిగవ్వకూడా రాదు. నాకు ఉన్నదంతా అయిపోయింది. నువు చాలా డబ్బు గడించిన వాడివి గనక ఆ కిటుకేదో చెబితివా నేను కూడా సుఖంగా బతుకుతాను," అన్నాడు.

"ఓరి పిచ్చివాడా! డబ్బు ఆ రాముడివ్వవలిసిందే," అన్నాడు వడ్డీవ్యాపారి.

రైతు ఆ రాముణ్ణి అడిగి డబ్బు తెచ్చుకోవటానికి ప్రయాణమయాడు. వాడి భార్య వాడికి మూడు రొట్టెలు కట్టి ఇచ్చింది. కొంతదూరం పోయాక రైతుకు ఒక బ్రాహ్మడు ఎదురయాడు. రైతు తన మూట విప్పి ఒక రొట్టె ఆ బ్రాహ్మడి చేతిలో పెట్టి, "స్వామీ, నేను రాముణ్ణి చూద్దామని పోతున్నాను. తమకు తెలిస్తే దారి కాస్త చెబుతారా?" అన్నాడు. బ్రాహ్మడు రొట్టె తీసుకుని, ఆకాశంకేసి చూసి కళ్లు మూసుకుని, ఏమీ అనకుండా తనదారిన తాను పోయాడు.

రైతు మరికొంత దూరం వెళ్ళాక ఒక యోగి ఎదురయాడు. రైతు యోగికి ప్రణమిల్లి లేచి, తన మూటలోనుంచి ఇంకొక రొట్టె తీసి ఇచ్చుకుని, "స్వామీ, రాముడి దగ్గిరికి వెళ్ళాలి, దారి ఎటు?" అని అడిగాడు. యోగి మౌనస్వామిలాగా మాట్లాడక తనదారిన తాను వెళ్ళాడు.

మరికొంత దూరం వెళ్ళాక దారిపక్క ఒక పేదవాడు కనిపించాడు. ఆ మనిషిని చూస్తేనే ఎంతో కాలంగా అన్నం తిన్న పాపాన పోయినట్టులేదు. రైతు అతణ్ణిచూసి జాలిపడి, అతని పక్కనే కూచుని, తనవెంట తెచ్చిన మూడో రొట్టె ఇచ్చి తినమన్నాడు.

ఎస్. వసుంధర

ఆ పేదవాడు ఆ రొట్టెను తిని, "ఎక్కడికి పోతున్నావు, బాబూ?" అని అడిగాడు.

"రాముణ్ణి చూస్తే డబ్బిస్తాడట, చూడబోతున్నాను. ఎవరినడిగినా దారి చెప్పకుండా ఉన్నారు. తెలిస్తే కాస్త చెబుదూ!" అన్నాడు రైతు.

పేదవాడు నవ్వి, "నేనే రాముణ్ణి. నువ్వు ఎక్కడికీ పోనవసరంలేదు. ఇదుగో ఈ శంఖం తీసుకో. దీన్ని ఎలా ఊదాలో నేను చెబుతాను. నువ్వు ఏది కోరినా ఈ శంఖం ఊదగానే ఆ కోరిక సిద్ధిస్తుంది," అన్నాడు. రైతు ఆ రాముడి సహాయంతో ఆ శంఖం ఊదటంలో గల కిటుకు తెలుసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. అది మొదలు రైతుకు ఏలోటూ లేదు. ఏది కావాలన్నా శంఖం ఊదగానే దానంతట అదే వచ్చేసేది.

ఒకనాడు వడ్డీవ్యాపారి రైతుదగ్గిరికి వెళ్ళి సంగతంతా తెలుసుకున్నాడు. తరవాత రైతు శంఖం దొంగిలించి తన ఇంటికి తీసుకుపోయాడు. కాని వాడికి దాన్ని ఊదే వైనం తెలియలేదు.

అందుచేత వడ్డీవ్యాపారి రైతువద్దకు వచ్చి, "ఇదుగో చూడు, నీ శంఖం నా దగ్గిరికి వచ్చింది. నీకు దాన్ని ఒక్క షరతు మీద అయితే యిస్తాను. ఆ శంఖంవల్ల నీకు ఎంత కలిగితే నాకు రెట్టింపు కలగాలి. అలా కాదంటే నేనా శంఖాన్ని నీ పాతబాకీకింద జమ వేసుకుంటాను," అన్నాడు.

విధిలేక రైతు సరేనన్నాడు. వడ్డీవ్యాపారి శంఖం తిరిగి ఇచ్చాడు. అది మొదలు శంఖం రైతుకు ఏమిచ్చినా వడ్డీవ్యాపారికి రెట్టింపు ఇస్తూ ఉండేది.

ఇంతలో ఒకనాడు రైతుకు ఒక గొప్ప ఆలోచన వచ్చింది. వాడు తన మనస్సులో, "నా కన్ను ఒకటి పోవాలి!" అని కోరుకుని శంఖం ఊదాడు. రైతుకు ఒక కన్ను పోయింది. వడ్డీవ్యాపారి రెండు కళ్ళూ పోయాయి. రైతుకు తృప్తి కలిగింది.






## 7

కౌరామోరాన్ నదికి దక్షిణంగా మంజీ అనే గొప్పదేశం ఉండేది. ఇది సిరిసంపదలతో తులతూగుతూ ఉండేది. ఈ దేశాన్ని పెద్ద ఖాను జయించక పూర్వం ఫక్ఫూర్ అనే రాజు పాలించుతూ ఉండేవాడు. ఒక్క పెద్దఖానును మినహాయిస్తే ఫక్ఫూర్‌ను మించిన రాజు ఎక్కడా లేడని చెప్పవచ్చు.

ఈరాజు ఆదర్శప్రాయంగా తన ప్రజలను పరిపాలిస్తూ ఉండేవాడు పేదలయెడ ఎంతో ఆదరంగా ఉండేవాడు. బీదవాళ్లు బిడ్డలను కని, పోషించలేక విడిచిపెట్టినట్టయితే ఈ రాజు ఆ బిడ్డలకు జాతకాలు రాయించి అనాథ శిశుపోషణాలయాలలో ఉంచి దాదులచేత పోషణ చేయించేవాడు. ఇటువంటి శిశు శరణాలయాలు ఆ దేశంలో ఎన్నో ఉండేవి. వాటిలో 20 వేలమంది శిశువులు పెరుగుతూ ఉండేవారు.

ఈ రాజుగారికి ఇంకొక చిత్రమైన అలవాటుండేది. ఆయన సవారీఅయి వెళ్లేవారిలో రెండు మంచి భవంతుల మధ్య ఒక పూరి ఇల్లు కనిపించినట్టయితే, అది అలా ఎందు కున్నదో విచారించి, మధ్య ఇల్లు కలవాడు పేదవాడని తెలిసినట్టయితే తన ఖర్చుతో మధ్య ఇంటిని ఇరుపక్కలా ఉండే ఇళ్లతో సమంగా కట్టించిపించేవాడు.

అయితే ఈ రాజులో ఉండిన ఒక్క లోటూ ఏమిటంటే ఆయన యోధుడుకాడు.





ప్రజలుకూడా యుద్ధం చెయ్యటం తెలిసిన వాళ్లు కారు. ఈ మంజీదేశం అనాదిగా శాంతి సౌఖ్యాలు అనుభవిస్తూ ఉండటమే దీనికి కారణం. ఈ దేశంపైకి ఎన్నడూ ఎవరూ దాడిచేసి ఉండలేదు. ఈ దేశంలోని ప్రతి నగరమూ లోతయిన నీటి అగడ్తలతో చుట్టబడి ఉండేది. నగరం దాటటానికి వంతెనలుండేవి. శత్రుబలాలు ఈ అగడ్తలను దాటివచ్చి నగరాలపై పడటం దాదాపు అసంభవంగా ఉండేది.

మంజీ ప్రజలు యోధులు కాకపోవటమూ, ఆ దేశంలో కనీసం గుర్రాలుకూడా లేకపోవటమూ మూలాన పెద్దఖాను ఈ దేశాన్ని జయించగలిగాడుగాని లేకపోతే ఇది ఆయనకు సాధ్యం కాకపోను. ఇది అంతా ఇలా ఉండగా జ్యోతిష్కులు ఈ దేశం గురించి ఒక జోస్యం చెప్పారు: నూరు కళ్ళవాడు వచ్చేదాకా దేశానికి శత్రుభయం ఏమీ లేదన్నారు.

పెద్దఖాను అయిన కుబిలాయ్‌ఖాన్ కింద పన్నెండుగురు శక్తిమంతులైన సామంతులుండేవారు. వారిలో బయాన్ చింగ్ సియాంగ్ ఒకడు. క్రీ. శ. 1268 లో పెద్దఖాను ఈ బయాన్ వెంట అంతులేని అశ్విక బలమూ, కాల్బలమూ ఇచ్చి, అనేక పడవలు కూడా అయత్తపరిచి మంజీ రాజ్యాన్ని గెలుచుకురమ్మని పంపాడు.

పడవల సహాయంతో నదులను దాటుతూ బయాన్ మంజీ రాజ్యాన్ని చేరవచ్చి, మొట్టమొదటగా హ్వాయ్-న్గాన్-చౌ అనే నగరం చేరి, పెద్దఖానుకు లొంగిపోవలిసిందని ప్రజలను ఆదేశించాడు. ఆ నగరంలోని ప్రజలు ఇందుకు పూర్తిగా నిరాకరించారు. బయాన్ వారినేమీ చెయ్యక మరొక నగరానికి వెళ్ళాడు; ఆ నగరంవాళ్ళు కూడా లొంగిపోవ నిరాకరించారు. ఈవిధంగా అయిదు నగరాలచేత నిరాకరించబడిన బయాన్ ఆరో నగరంపైన పడి ఆక్రమించు



కున్నాడు. అతను ఈ నగరంలోని ప్రజల నందరినీ చంపేశాడనికూడా చెబుతారు.

బయాన్ మొదటి అయిదు నగరాలనూ ఉపేక్షించటానికి కారణం లేకపోలేదు. పెద్ద ఖాను వెనకగా మరొక బ్రహ్మాండమైన సేన పంపుతున్నాడని అతనికి తెలుసు. ఆ అయిదింటినీ విడిచిపెచ్చిన బయాన్ పన్నెండు నగరాలను వరసగా జయించి, మంజీ రాజధాని అయిన కిన్సాయ్ నగరానికి వెళ్లాడు. రాజూ రాణీ ఈ కిన్సాయ్ నగరం లోనే ఉండేవారు.




రాజు భయపడి, వెయ్యి పడవలలో తన బలగాన్ని ఎక్కించుకుని సముద్రంలోని దీవులకు పారిపోయాడు; ఆ దీవులనుంచి ఆయన మరి తిరిగి రానేలేదు. ఈ లోపల రాణి మాత్రం నగరంలోనే ఉండి బయాన్ దాడిని నిరోధించటానికి యత్నించింది. ఇంతలో ఆమెకు తమ శత్రుసేనాని పేరు బయాన్ అని తెలియవచ్చింది. బయాన్ అంటే నూరు కళ్లు గలవాడని అర్థం. ఆమెకు జోస్యం జ్ఞాపకం వచ్చి నిరుత్సాహం ఏర్పడి, వెంటనే బయాన్‌కు లొంగిపోయింది.

ఎప్పుడైతే రాజధాని పెద్దఖానుకు లొంగి పోయిందో అప్పుడే మంజీలోని మిగిలిన నగరాలన్నీ లొంగిపోయాయి. ఒక్క చే ఒక్క నగరం లొంగలేదు; దానిపేరు సియాంగ్-యాంగ్-ఫూ. మంజీ యావత్తూ పెద్దఖానుకిందికి వచ్చిన మూడేళ్ల అనంతరం ఈ నగరం ఇంకా పెద్దఖాను సేనల ముట్టడిని ప్రతిఘటించుతూనే ఉండింది.

ఇది ఎలా సాధ్యమయింది? పెద్దఖాను బలాలు ఈ నగరాన్ని ముట్టడించికూడా ఎందుకు లొంగదీసుకోలేకపోయాయి?

ఈ నగరానికి మూడువైపుల ఒక లోతైన సరస్సు ఉండి శత్రుభయం లేకుండా కాపాడుతూ ఉండేది. ఒక్క ఉత్తర పార్శ్వాన్నిమాత్రమే పెద్దఖాను బలాలు ముట్టడించాయి. నగరవాసులు సహజంగా

ఈ ముట్టడిని ఖాతరు చెయ్యలేదు. ఎందుకంటే వారికి కావలిసిన సంబారాలన్నీ నీటిమీదుగా వారికి చేరుతూవచ్చాయి. అందుచేత ముట్టడి పూర్తిగా విఫలమయింది. పెద్దఖాను కొలువులో ఉన్న పోలోలు—మార్కో, అతని తండ్రులూ—సహాయపడక పోయినట్టయితే సియాంగ్-యాంగ్-ఫూ ఎన్నటికీ పెద్దఖానుకు లొంగేదికాదు.

ఒకనాడు సియాంగ్-యాంగ్-ఫూనుంచి కొందరు మనుషులు పెద్దఖానువద్దకు తిరిగి వచ్చి, మూడేళ్లుగా నడిచిన ముట్టడి ఎందుకూ కొరగాకపోయిందని విన్నవించారు.

"ఈ నగరాన్ని జయించటానికి ఏదో ఒకటి చెయ్యాలిగద!" అన్నాడు పెద్దఖాను.

అప్పుడు పోలోలు ఆ నగరాన్ని జయించే సాధనం ఒకటి ఉన్నదనీ, దానిని నిర్మించగలవారు తమవెంట ఉన్నారనీ పెద్దఖానుకు విన్నవించారు. అది రాళ్లను విసిరే యంత్రం—వంద వీశెల బరువు గల కొండరాళ్ళను సయితం, వడిసెలలాగా, ఎంతో దూరం విసరగలదు.

"అయితే అలాటి యంత్రాన్ని వెంటనే తయారుచేయించండి!" అని పెద్దఖాను పోలోలకు ఉత్తరువిచ్చాడు. పోలోల పరివారంలో ఈ యంత్రాలు చెయ్యగలవాళ్ళు ఇద్దరున్నారు. వారు త్వరలోనే మూడు వడిసెల యంత్రాలను తయారుచేశారు. పెద్దఖానూ, అతని పరివారమూ వాటి ప్రయోగాలను చూసి ఆనందపరవశులయారు.

పెద్దఖాను సైనికులు ఈ యంత్రాలను సియాంగ్-యాంగ్-ఫూ వద్దకు చేరవేశారు. ఒక్క యంత్రంనుంచి విసిరిన రాయి నగరంలోని ఇళ్లపైన పడి మహోత్పాతం కలిగించేసరికి నగర ప్రజలు బెదిరిపోయి, ఈ ఉత్పాతానికి విరుగుడు లేదని నిశ్చయించుకుని, ఇతర నగరాలు లొంగిపోయిన షరతులమీదనే పెద్దఖానుకు లొంగిపోవటానికి సమ్మతించారు. —(ఇంకావుంది)



# గడ్డంలో గడ్డిపరక

ఒక రోజున అక్బర్ చక్రవర్తి శయనాగారంలోని అల్మారానుంచి ఖరీదైన ఒక నగను ఎవరో దొంగిలించారు. అక్కడ పనిచేస్తూండే నౌకర్లలో దొంగ ఎవడో తెలుసుకునేదెల్లా? అక్బరు దొంగను పట్టే పని బీరబల్‌కు ఒప్పచెప్పాడు. బీరబల్ నగ పోయిన అల్మారా దగ్గిరకు వెళ్ళి, దాంట్లో తల దూర్చి, కొంచెంసేపు ఏదో వింటున్నట్టుగా నటించి, తరవాత అక్బరుకేసి తిరిగి, "ఈ అల్మారా, దొంగను దొరకపుచ్చుకునే మార్గం చెప్పింది. ఆ నగ దొంగిలించినవాడి గడ్డంలో ఒక చిన్న గడ్డిపరక వుంటుందట!" అన్నాడు.

బీరబల్ యిలా అనగానే అక్కడున్న నౌకర్లలో ఒకడు వేళ్ళతో గడ్డం సవిరించుకున్నాడు. బీరబల్ వాణ్ణి పట్టుకుని ప్రశ్నించేసరికి, వాడు బెదిరిపోయి దొంగిలించిన నగ తెచ్చియిచ్చాడు.





# పేద బ్రతుకు

పట్టు వదలని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్ళి, చెట్టునుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మహావైభవాలకు అలవాటు పడిన నీవు ఈ హేయమైన పనిని ఎలా ఇంత దీక్షగా చేస్తున్నావో నాకు నిజంగా అర్థం కాకుండా ఉన్నది. వినయగుప్తుణ్ణి ఎంతగానో ప్రేమించిన హేమాంబిక తాను నివసించబోయే పేద ఇంటిని కొద్దిసేపైనా భరించలేక తన ప్రేమను సయితం కోల్పోయిందిగదా! నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు వారిద్దరి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

వర్తకానికి ప్రసిద్ధి గన్న పలభీనగరంలో ధనగుప్తుడనే వైశ్యుడుండేవాడు. ఆయన కావటానికి సంపన్నుడే అయినా కలిమికి మించిన వైభవంతో జీవించి తన ఆస్తి కొంచెం కొంచెంగా పోగొట్టుకోసాగాడు. భవి

బేతాళ కథలు





ష్యత్తు మాట ఎలా ఉన్నా, ఆయన భార్యా, పిల్లలూ చీని చీనాంబరాలు ధరించారు, మేనాలలో ఎక్కి తిరిగారు, అన్ని భోగాలూ అనుభవించారు.

ధనగుప్తుడి కుమార్తె హేమాంబికకు యుక్తవయసు వచ్చేసరికి వారి సంపద చాలాభాగం తరిగిపోయింది. అందుచేత ఆమెను పెళ్లాడటానికి గొప్పఇంటివా రెవరూ ముందుకు రాలేదు.

అయితే కొన్నాళ్ళకు అదృష్టవశాత్తూ హేమాంబికకు ప్రేమపాత్రుడైన వినయగుప్తుడనే వలభీనగర యువకుడు ఒకడు వరుడుగా లభించాడు.

ఈ వినయగుప్తుడు ఎంతో అందగాడు మాత్రమే గాక, మాన మర్యాదలు తెలిసిన వాడు, సంస్కారమూ చదువూ ఉంది, ఎవరితో ఎలా మసులుకోవాలో చక్కగా తెలిసినవాడు.

అటువంటివాడు ఏ రాజసభకైనా అలంకారంగా ఉండగలడు.

అయితే వినయగుప్తుడు గొప్ప వంశంలో పుట్టినవాడు కాడు. పేదకుటుంబంలో పుట్టినవాడు. పేదరికం అనుభవిస్తూనే, స్వశక్తిచేతా, కృషి చేసీ పైకి వచ్చి, వలభీ నగరంలోని వర్తకులవద్ద కొలువు సంపాదించుకుని హాయిగా జీవయాత్ర గడుపుకుంటున్నవాడు.

హేమ వినయుణ్ణి పెళ్ళాడటానికి సిద్ధపడిందిగాని ఆ పెళ్లి ఆమె తల్లిదండ్రులకు అంతగా ఇష్టం లేదు. వినయుడు అందగాడూ, బుద్ధిమంతుడూ, పైకి రాదగిన వాడూ అని వాళ్ళు ఒప్పుకున్నారు; కాని హేమ గొప్పఇంటివాణ్ణి ఎవరినైనా పెళ్లాడితే బాగుంటుందని వారి ఉద్దేశం. ధనగుప్తుడు తన కుమార్తెకు కొన్ని గొప్ప సంబంధాలు చూశాడు, కాని వాటిలో ఒక్కటీ హేమకు నచ్చలేదు. వినయుడిలో ఉండే ఆకర్షణలో నూరోవంతు కూడా వారిలో ఆమెకు కన



బడలేదు. వినయుడికి గల మంచి లక్షణా లన్నీ గల యువకుణ్ణి గొప్ప వంశంనుంచి తీసుకువచ్చే శక్తి ధనగుప్తుడికి లేదు. అందు చేతనూ, వినయుడంటే హేమకు ఎంతో ఇష్టంగా ఉన్నదిగనకనూ ఆమె తల్లి దండ్రులు ఈ పెళ్ళికి సమ్మతించారు.

హేమ వినయుల పెళ్లికి నిశ్చితార్థం జరిగింది. ముహూర్తంకూడా ఏర్పాటుచేశారు. వినయుడు హేమతో, "మన పెళ్ళికి మీవాళ్ళు ఒప్పుకోవటం నాకు ఎంతో గొప్ప అదృష్టం. నీవెంట నాకింకా మంచి రోజులు వస్తాయనుకుంటున్నాను. మనం కాపరం చెయ్యబోయే ఇంటిని నీవింతదాకా చూడనే లేదు. ముందే వచ్చి చూసుకున్నావంటే పెళ్ళి అయి గృహప్రవేశం చేసే లోపుగా నీవు కోరే మార్పులేమైనా ఉంటే చేయించ గలను!" అన్నాడు.

మర్నాడే హేమ మేనా సిద్ధంచేయించి, తనకు గల మంచి జరీ పట్టుచీరెలలోకెల్లా మంచిదిగా చూసి ధరించి, వినయుడు చెప్పిన గుర్తులు బోయీలకు చెప్పి, మేనాలో బయలుదేరి తాను మెట్టబోయే ఇంటికి బయలుదేరింది.

మేనా రాజవీధులూ, మామూలు వీధులూ దాటి గొందులవెంట ముందుకు పోసాగింది. మిద్దెలూ, మేడలూ పోయి పూరి



పాకలూ, పశువుల శాలలూ, ఇళ్ళ పక్కన పెంట పోగులూ కంట పడసాగాయి. "ఇదే మిటి, వినయుడి ఇంటికి పోయే దారి ఇంత హీనంగా ఉన్నది!" అని హేమ తనలో ఆశ్చర్యపడింది.

చివరకు మేనా అలాటి ఇళ్లమధ్యనే ఒక పెంకుటింటిముందు ఆగింది. హేమ మేనాలోనుంచి దిగి ఆ యింటికేసి వింతగా చూసింది. అది అడుసు గోడలు గల ఇల్లు. గోడలకు పూసిన పేడ బెత్తికలు అక్కడక్కడా ఊడిపోయాయి.

వినయుడు బయటికి వచ్చి నవ్వుతూ, "ఇదే మన యిల్లు! లోపలికి వచ్చి అంతా చూడు. చూడటానికి ఎంతోసేపు పట్టదులే!" అన్నాడు.

లోపలికి పోయే నడవ చాలా ఇరుకుగా ఉన్నది. హేమ లోపలికి అడుగు పెడుతుండగానే కాళ్ళకు చీపురుకట్ట ఒకటి తగిలింది. ఆమె చిదరించుకుంటూ పక్కకు ఒత్తిగిలేసరికి ఆమె భుజానికి నడవ గోడ తగిలి పమిట కొంగుకు నల్లగా మట్టి మరక అయింది. తళతళలాడే జరీపైన అది చాలా వికారంగా కనిపించింది. హేమ కళ్ళనీళ్ళ పర్యంతమయింది.

వినయుడు ఇదేమీ పట్టించుకోలేదు, గమనించనుకూడా లేదు. అతను ముందు







"ఇల్లు బాగుచేసేవాళ్లు ఇప్పుడే వచ్చారు. వాళ్ళతో మాట్లాడి ఇప్పుడే వస్తాను. ఈ లోపుగా ఈ కుర్చీలో కూచుని ఇంటికి కావలి సిన వేమిటో ఆలోచించు. కొద్ది ఖర్చుతో మనం ఈ ఇంటిని వీలయినంత సుఖంగా చేసుకోవచ్చు!" అని హేమతో చెప్పి విన యుడు బయటికి వెళ్ళాడు.

హేమకిదంతా కలలాగా ఉన్నది. ఆమె కుర్చీలో కూచుని దానిపై చెయ్యి ఆనించే సరికి చేతికి దుమ్ము తగిలింది. ఆమె చివా లున లేచి, మెడ వెనక్కు తిప్పి తన చీరె అంతా దుమ్ము అయినట్టు తెలుసుకున్నది. ఆమెకిక దుఃఖం ఆగలేదు. "ఛీ, ఛీ! వెధవ కొంప! ఎక్కడ చూసినా మసీ, దుమ్మూ, బూజూనూ!" అని తిట్టుకుని ఏడుస్తూ పమిట కొంగుతో కళ్ళు తుడుచుకున్నది. ఆమె కళ్ళూ, చెంపలూ మట్టితో నల్లగా అయిపోయాయి.

ఆమె దుఃఖం మరింత అయింది. చీరె కొంగుతో ముఖం కప్పుకున్నది.

ఆమె ఈ దుఃఖంలో మునిగి ఉండగా వినయుడు తిరిగి వచ్చాడు. "ఏమిటీ? ఏమయింది? ఎందుకు ఏడుస్తున్నావు?" అని అతను హేమను ఎంతో ప్రేమగా అడిగాడు.

నడుస్తూ లోపలికి దారి తీశాడు. "ఇది నట్టిల్లు, ఈ పక్క వంటిల్లు, ఇవతలపక్క పడకగది. వెనక వసారా, సామాన్లగదీ ఉన్నాయి." అంటూ అతను ఇంటి వివరా లన్నీ ఆమెకు చెప్పాడు.

హేమ అంత పేద ఇంట్లో ఏనాడూ జీవించలేదు సరికదా, ఏనాడూ ప్రవేశించను కూడా లేదు. కప్పు ఎక్కడ చూసినా మసి బారి బూజు వేళ్లాడుతున్నది. అన్ని గోడలూ పెళ్ళలూడి, దుమ్ము కొట్టుకుని ఉన్నాయి.

పడకగది అన్నది కూడా తతిమ్మా వాటి కన్న ఏమీ శుభ్రంగా లేదు. ఆ గదిలో ఒక పాత కుర్చీ ఉన్నది.



"ఛీ! నా వళ్ళంతా మసి, చేతులంతా మసి, ముఖమంతా మసి! బంగారమంటి పట్టుచీరె అంతా మసి కొట్టుకుపోయింది! నేనిక్కడ ఒక్క క్షణం ఉండను! వెళ్ళిపోతాను!" అన్నది హేమ ఏడుస్తూనే.

"చీరె మట్టి అయిందనా ఏడుస్తున్నావు? ఇది రాజభవనం అనుకున్నావా? మన పెళ్లి అయినాక ఈ ఇంటికి మట్టి దులపటం, బూజు దులపటంలాటి పనులు నువేకదా చూడాలి. మట్టిచూసి భయపడితే ఎలాగా?" అన్నాడు వినయుడు.

"నా బంగారమంటి చీరె! నా ఒళ్లంతా మట్టే! ఇంటికి పోయి తలంటు స్నానం చేస్తేగాని ఈ దిక్కుమాలిన మట్టి వదలదు!" అన్నది హేమ, వినయుడన్న మాట వినిపించుకోకుండా.

వినయుడిలో పెద్ద మార్పు వచ్చింది. అతను గంభీరంగా, "క్షమించు, హేమా! నిన్నిక్కడికి రమ్మనటం చాలా పొరపాటయింది. ఇటువంటి చోట నీవు ఒక్క క్షణం ఉండలేవు, కాపరం ఎలా చెయ్యగలవు?" అన్నాడు.

హేమ మేనా ఎక్కి తన ఇంటికి వెళ్ళిపోయింది. ఆమెను చూడటానికి వినయుడు మరి వెళ్ళలేదు. అతను ధనగుప్తుడి వద్దకు మనిషిని పంపి, తాను హేమాంబికను



పెళ్ళాడటానికి అర్హుడుకాడనీ, అందుచేత పెళ్ళి ప్రయత్నాలన్నీ విరమించవలిసిందనీ చెప్పించాడు.

హేమకు ఈ సంబంధం తప్పిపోయినందుకు తల్లిదండ్రులు కొంచెంకూడా దిగులు పడలేదు. తమ పిల్ల అదృష్టం బాగుండటం వల్లనే ఇలా జరిగిందనుకున్నారు. వినయుడు తనను నిజంగా ప్రేమించలేదనీ, అందుకే అకారణంగా తనపై అలిగి పెళ్ళి మానుకున్నాడనీ అనుకున్నది హేమ.

బేతాళుడీకథ చెప్పి, "రాజా, వినయుడు హేమను ప్రేమించకపోవటానికి కారణమేమిటి? కనీసం ఆమెపైన ప్రేమ ఉన్నట్టు నటించక, దుఃఖిస్తున్నదాన్ని ఓదార్చనైనా ఓదార్చకుండా, ఆమెను అలాగే పంపేశాడు గదా, అటువంటివాడు ఆమెను మొదట పెళ్ళాడటానికి ఎందుకు సిద్ధపడ్డాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వినయుడికి హేమపై ప్రేమ ఉన్నదనటానికి ఎటువంటి సందేహమూ లేదు. హేమ కూడా వినయుణ్ణి ప్రేమించిందిగాని, అతని దారిద్ర్యాన్ని స్వయంగా చూడకుండానే ఆమోదించింది. ఆమె అతని ఇంటికి వెళ్లటం ఆమె ప్రేమకు పరీక్ష అయిందిగాని, వినయుడి ప్రేమకు పరీక్ష కాలేదు. అతని దారిద్ర్యాన్ని కొద్దిసేపు భరించలేని మనిషి ఆ దారిద్ర్యంతో కలకాలం కాపరం చెయ్యగలదా? ఒకవేళ పంతానికి ఆ దారిద్ర్యాన్ని ఆమె ఆమోదించినప్పటికీ అది ఆమెకు ఎంతో త్యాగమవుతుంది. ఆమెచేత అంత త్యాగం చేయించటం అతనికి ఇష్టం లేకపోయిందంటే అందుకు కారణం అతనికి ఆమెపైన గల ప్రేమేగాని మరొకటి కాదు!" అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# తప్పించుకు పోయిన దొంగ

CHITRA

వెయ్యి సంవత్సరాల క్రితం హూంగ్ చౌ నగరంలో ఒక ప్రసిద్ధుడైన గజదొంగ ఉండేవాడు. వాడి అసలుపేరేమిటో, మనిషి ఎలా ఉంటాడో ఎవరికీ తెలియదు. వాడు ఎన్ని ఇళ్లలోనో జొరబడి ఎన్నో దొంగతనాలు చేసినప్పటికీ వాణ్ణి కళ్ళతో చూసినవారు లేరు. అయితే వాడు దొంగతనం చేసినప్పుడల్లా ఇంటి లోపలి గోడమీద "ఇదుగో వచ్చాను" అని రాస్తూ ఉండేవాడు.

ఈ కారణంచేత అందరూ వాణ్ణి "ఇదుగో వచ్చాను" అనేవాళ్ళు.

రానురాను "ఇదుగో వచ్చాను" దొంగతనాలు దుర్భరమైపోయాయి. ఈ గజదొంగ బారినుంచి తమను కాపాడవలిసిందిగా వారు ప్రభుత్వానికి మొరపెట్టుకున్నారు. "ఇదుగో వచ్చాను" అన్న దొంగకోసం నగరమంతా ఘాలించి పట్టుకోవలిసిందని నగరపు న్యాయాధికారి రక్షకభటులను ఆజ్ఞాపించాడు. ఈ దొంగను పట్టుకోవటానికి ఆయన ఒక గడువుకూడా ఏర్పరిచాడు.

రక్షకభటులు పెద్ద చిక్కులో పడ్డారు. దొంగ చూడబోతే దేవాంతకుడు. వాడు ఎవడో, ఎలా ఉంటాడో, ఎక్కడ ఉంటాడో చెప్పగలవాడు ఒక్కడూ లేడు. అటువంటి వాణ్ణి ఇన్నిరోజులలోగా పట్టుకోవాలి అంటే అది సులువైన పని కాదు. అయినప్పటికీ దీక్షతో పనిచేస్తే సాధించరానిదంటూ ఉండదు గనక రక్షకభటులు ఒక మనిషిని పట్టి న్యాయాధికారివద్దకు తెచ్చి, "అయ్యా, వీడే 'ఇదుగో వచ్చాను'. వీడికి శిక్ష విధించి నగరానికి పీడ విరగడ చెయ్యండి!" అని చెప్పారు.

"గజదొంగ వీడేననటానికి సాక్ష్యం ఏమిటి?" అని న్యాయాధికారి అడిగాడు.

"మేము బహు శ్రద్ధగా ఆచోకీ చేసి వీణ్ణి పట్టుకున్నాము. మీరు మా మాటయందు



విశ్వాసం ఉంచవచ్చును!" అన్నారు రక్షక భటులు ఏక కంఠంగా.

"మహాప్రభూ, వీళ్లు తమ బాధ్యత వదిలించుకోవటానికిగాను ఎవరినో ఒకరిని పట్టుకుందామనుకున్నారు. నా కర్మకొద్దీ నేను దొరికాను!" అన్నాడు పట్టుబడినవాడు.

న్యాయాధికారి అనుమానంలో పడటం చూసి రక్షకభటుల నాయకుడైన కొత్వాలు, "వీడి మాటలు నమ్మి వీణ్ణి విడిచిపుచ్చేరు! వీడే అసలు దొంగ. వీణ్ణి పట్టుకునేసరికి మా తల ప్రాణాలు తోకకు వచ్చాయి. ఇప్పుడు విడిచిపుచ్చారో వీడు మరి దొరకడు!" అని గట్టిగా చెప్పాడు.

కొత్వాలు అంత గట్టిగా చెప్పినమీదట న్యాయాధికారి, "సరే ప్రస్తుతానికి ఖైదులో ఉంచండి. విచారణలో నిజం తెలుతుంది!" అన్నాడు.

పట్టుబడినవాడు నిజంగా గజదొంగే. వాడు ఖైదులో అడుగు పెడుతూనే జైలు అధికారితో ఎంతో వినయంగా, "అయ్యా, కొత్త ఖైదీలు ఉత్త చేతులతో తమవద్దకు రావటం ఆచారం కాదు. కాని ఏంచెయ్యను. రక్షకభటులు నన్ను పట్టుకున్నప్పుడు నా దగ్గిర ఉన్నదంతా ఊడగొట్టి లాగేసుకున్నారు. తమకు అభ్యంతరం లేకపోతే, కొండదేవర గుడికి వెళ్లి, అక్కడ పగిలిన ఇటుకరాయికింద నేను దాచుకున్న వెండి తెచ్చుకోండి," అన్నాడు.

జైలు అధికారి ఈ మాటలు నమ్మలేదు, కాని తీరా వెళ్లి చూస్తే ఖైదీ చెప్పినచోట సేరు వెండి దొరికింది.

అది మొదలు జైలు అధికారి ఖైదీని చక్కగా చూస్తూ వాడితో చాలా సఖ్యంగా ఉండసాగాడు.

కొద్ది రోజులు పోనిచ్చి ఖైదీ జైలు అధికారితో, "వంతెనకింద కూడా కొద్దిమొత్తం దాచుకున్నాను. అదికూడా తెచ్చేసుకోరాదా?" అన్నాడు.



"వంతెనమీద ఎప్పుడూ జనం తిరుగుతూంటారే!" అన్నాడు జైలు అధికారి.

"నదిలో బట్టలు ఉతకటానికి వెళ్ళినట్టుగా గంప తీసుకుపొండి. డబ్బు తీసి గంపలో పెట్టుకుని, దానిపైన గుడ్డలు కప్పేస్తే నరమానవుడికి తెలియదు!" అన్నాడు ఖైదీ.

అధికారి అ ప్రకారమే చేసి వీశెడు వెండి తెచ్చుకున్నాడు. అ తరవాత ఇద్దరికీ మధ్య ప్రాణస్నేహం ఏర్పడింది. ఆ రాత్రి జైలు అధికారి ఖైదీతో కలిసి తాగటానికి సారా కూడా పట్టుకువచ్చాడు.

"చూడు, అన్నా! ఈ రాత్రి నేను ఇంటికి వెళ్లి వస్తాను. తెల్లారేసరికల్లా తిరిగి వస్తాను, నీపైన ఒట్టు! పారిపోతానని భయపడకు. పారిపోతే నా నేరం నేనే ఒప్పుకున్నట్టుకాదా? పైగా పారిపోవటం అర్థం లేని పని. ఇవాళ కాకపోతే రేపైనా న్యాయాధికారిగారు నన్ను వొదిలిపెట్టాల్సిందే. నేను దోషినికానుగద!" అన్నాడు ఖైదీ నమ్మకంగా.

ఖైదీని పోనివ్వటం తనకు ప్రమాదమేనని తెలిసికూడా, కాదు కూడదనటానికి అధికారి మొహమాటపడి సరేనన్నాడు. ఖైదీ బయటికి వెళ్లటానికి జైలు గేటు తలుపులు



ఉపయోగించక కప్పుమీదికి ఎక్కి వెళ్ళిపోయాడు.

మళ్ళీ తెల్లవారుజామున కప్పుమీదినుంచే దిగివచ్చి, ఇంకా నిద్ర లేవని జైలు అధికారిని లేవగొడుతూ, "ఇదుగో వచ్చాను! ఇదుగో వచ్చాను!" అన్నాడు.

"మొత్తంమీద అన్న మాట నిలబెట్టుకున్నావే! భలే మంచివాడివి," అన్నాడు అధికారి సంతోషిస్తూ.

"అమ్మమ్మా! లేకపోతే నీ పరువు పోదా, అన్నా? నువు నాకు చేసిన ఈ మేలు ఎన్నటికీ మరవను. నా కృతజ్ఞత చూపటానికి ఉడతాభక్తిగా మీ ఇంట చిన్న కానుక పడేసి

వచ్చాను. ఇప్పుడే వెళ్ళి చూసుకో. నేనిక్కడ ఎంతోకాలం ఉండబోనులే!" అన్నాడు ఖైదీ. జైలు అధికారి ఇంటికి వెళ్ళాడు.

"మీకోసం కబురుపెడదామనుకుంటుండగా మీరే వచ్చారు. తెల్లారుజామున ఎంత చిత్రం జరిగిందనుకున్నారు? ఇంటి కప్పు మీద ఏదో చప్పుడయింది. ఇంతలోనే ఈ పొట్లం గదిలో పడింది. తెరిచి-చూద్దును గదా వెండి పళ్ళాలూ, బంగారు పళ్ళాలూ ఉన్నాయి!" అన్నది జైలు అధికారి భార్య.

తన ఖైదీ ఇచ్చిన కానుక ఇదేనని అధికారికి అర్థమయింది. "పైకి అనకే, నీకు పుణ్యం ఉంటుంది! వాటిని భద్రంగా దాయి! తరవాత మెల్లి మెల్లిగా అమ్మి సొమ్ము చేసుకుందాం!" అన్నాడాయన భార్యతో.

ఆ రోజు న్యాయస్థానానికి వచ్చినవారిలో ఆరేడుగురు గృహస్థులు తమ ఇంట కిందటి రాత్రి "ఇదుగో వచ్చాను" జొరబడి, దొంగతనాలు చేసి, గోడలమీద తన పేరు రాసి వెళ్ళినట్టు ఫిర్యాదులు తెచ్చారు. ఈ గజదొంగను వెంటనే పట్టుకోమని కూడా వారు న్యాయాధికారిని వేడుకున్నారు.

"నేను అప్పుడే అనుకున్నాను! రక్షకభటులు పట్టుకున్నది మరొకణ్ణి—అసలు దొంగ తిరుగుతూనే ఉన్నాడు!" అనుకున్నాడు న్యాయాధికారి. ఒక నిర్దోషికి అన్యాయం జరిగిందని తోచి ఆయన, ఖైదీని వెంటనే విడుదల చెయ్యవలిసిందిగా జైలు అధికారికి అజ్ఞాపత్రం పంపుతూ, ఫలాని గడువు లోగా "ఇదుగో వచ్చాను" అనే గజదొంగను పట్టుకోవలిసిందిగా రక్షకభటులను తిరిగి ఆజ్ఞాపించాడు.

గజదొంగ ఖైదులో పడి కూడా తప్పించుకు పారిపోయాడు. ఆ పోయినవాడే గజదొంగ అన్న విషయం ఒక్క జైలు అధికారికి మాత్రమే అర్థమయింది; కాని ఆయన దొంగసొత్తు తిని ఉండటంచేత కుక్కిన పేనులాగా ఉండిపోయాడు.






"నేనేం చెయ్యలేదండి. దానికి బద్ధకం— అందుకనే ఏడుస్తోందండి."

"బద్ధకం అయితే ఏడుపెందుకు?"

"మరి చీమల పుట్టమీద కూచుందికదా. అవి కుడుతున్నాయి. లేచేందుకు బద్ధకం అందుకు."




"డాక్టరుగారూ—మా ఆవిణ్ణి చూసినప్పు డల్లా కళ్లెదుట చుక్కలు కనిపిస్తున్నా యండి. కళ్లజబ్బంటారా?"

"బావుంది—నువ్వు చిరుతపులివి కదా మరి చుక్కలు కనబడకపోతే...."

"అబ్బే మా ఆవిడ పెద్దపులి అండి."




"ఆ అమ్మాయి ఒక కాలు పైకెత్తి డాన్సు చేస్తోందేం?"

"మరిరెండు కాళ్లూ పైకెత్తితే పడిపోతుందిగా."



"అబ్బే, దానికేం—నువ్వు రాజహంస అయ్యే నాటికి నేను బంగారు గుడ్లే పెడతానులే—"




ఒక గ్రామంలో ముగ్గురు అన్నదమ్ములుండే వారు. ఆస్తి పంపకంలో వారికి ఒక పొలం గురించి తగాదా వచ్చింది. ఆ పొలం తనకే రావాలని ఎవరిమటుకు వారు వాదించారు. ఆ పొలంమీద ప్రతి ఒక్కడికీ పూర్తి హక్కు ఉండటంచేత మధ్యవర్తి నిర్ణయం చెయ్యటం ఎవరికీ సాధ్యంకాలేదు.

చివరకు ముగ్గురు అన్నదమ్ములూ ఒక న్యాయాధిపతి వద్దకు వెళ్లి తమ తగాదాలో తీర్పు చెప్పమన్నారు. ముగ్గురి వాదాలూ విని న్యాయాధికారి వారితో, "రేపల్లా ఆలోచించి ఎల్లుండి తీర్పు చెబుతాను. ఎల్లుండి నా వద్దకు రండి," అని చెప్పాడు.

న్యాయాధికారి అలా చెప్పాడేగాని, ఎంత ఆలోచించినప్పటికీ ఎవరిపక్షంగా తీర్పు చెప్పాలో ఆయనకు తోచలేదు. ఆ పొలం మీద ఆ ముగ్గురికీ సమంగానే పూర్తి హక్కు ఉన్నట్టు కనబడింది. అయినప్పటికీ, న్యాయాధికారి అయినవాడు తగాదాలో ఏదో ఒక విధంగా తీర్పు ఇచ్చి తీరాలిగనక, యుక్తిని ప్రయోగించి తీర్పు చెప్పటానికి న్యాయాధికారి నిశ్చయించుకున్నాడు.

గడువునాటికి ముగ్గురు అన్నదమ్ములూ న్యాయాధికారి వద్దకు వచ్చారు.

"చట్టరీత్యా ఆ పొలంమీద మీకు గల హక్కులన్నీ పరిశీలించాను. కాని నేను తీర్పు చెప్పేముందు మీగురించి కొన్ని విషయాలు నాకు తెలియాలి. అందుకని నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను. వాటికి సమాధానాలు చెప్పండి. మీరు ముగ్గురూ సోమరిపోతుల్లాగే ఉన్నారు, కాని మీ ముగ్గురిలోనూ ఎవరు ఎక్కువ సోమరిపోతు?" అని న్యాయాధికారి అడిగాడు.

ముగ్గురూ నేనంటే నేను అన్నారు.

"నేను దారికి అడ్డంగా పడుకుని ఉండగా అటుగా పశువులమంద వస్తే వాటి

ఎ. బంగారయ్య

కాళ్ళకింద నలిగి అయినా పోతానుగాని దారిలోనుంచి లేవను!" అన్నాడు పెద్దవాడు.

"నేను పడుకున్న ఇల్లు అంటుకుని మంటలు మీదికి వస్తున్నా నేను లేవను," అన్నాడు రెండోవాడు.

"పైనుంచి బూజు కంట్లో పడుతున్నా కళ్లు మూసుకోలేనంత ఒళ్లు బద్ధకం నాకు!" అన్నాడు మూడోవాడు.

"ఎవరికీ ఎవరూ తీసిపోయేట్టు లేరే! సరే, ఇది చెప్పండి: మీలోకల్లా ఎవరు వయసులో పెద్ద?" అన్నాడు న్యాయాధికారి. అన్నదమ్ములు మళ్ళీ నేనంటే నేను అన్నారు.

"పిల్లులు కాళ్ళకు అడ్డం వస్తే మనుషులు వాటిని తన్నని రోజులు నాకింకా జ్ఞాపకం," అన్నాడు పెద్దవాడు.

"ఆడవాళ్లు ఒకళ్ళనొకళ్లు ఎత్తిపొడుచుకోని రోజులు నాకు బాగా జ్ఞాపకం," అన్నాడు రెండోవాడు.

"పదిమందిలో ఒకడు నిజం చెప్పేవాడుండిన రోజులు నేనెరుగుదును," అన్నాడు మూడోవాడు.

"అలా అయితే మీలో ఎవరు పెద్ద అనేది తేల్చటం కష్టమే మరి. చూడండి, మీలో ఎవరికి చూపు బాగా ఆనుతుంది?" అని అడిగాడు న్యాయాధికారి.



"పదిమైళ్ళ దూరాన ఉండే ఆ కొండ పైన కూచున్న పక్షి కళ్ళార్పితే అది నాకు కనిపిస్తుంది," అన్నాడు పెద్దవాడు.

"ఆ పక్షి కంట్లో నలుసు పడి అది కళ్లు ఆర్పుతున్నదీ, ఊరికేనే ఆర్పుతున్నదీ నేను చెప్పగలను," అన్నాడు రెండోవాడు.

"ఆ పక్షి కంట్లో పడినది ఏ నలుసైనదీ నేను చెప్పగలను," అన్నాడు మూడోవాడు.

"ముగ్గురూ ముగ్గురేనే! మరొక సంగతి. మీలో ఎవరు ఎక్కువ చలాకీ అయినవాళ్ళు?" అని న్యాయాధికారి అడిగాడు.

"నేనే లెండి. ఒక పొలంలో ఒక వేటకుక్కనూ, కొన్నివేల కుందేళ్ళనూ పెట్టి

నన్ను వదలండి. నేను ఒంటికాలితో గెంతుతూ, కుందేలు ఒక్కటికూడా పొలం దాటి బయటికి పోకుండా చూడగలను," అన్నాడు పెద్దవాడు.

"అదొక లెక్కా? కొండమీది కోట చూశారా? దానికి కప్పు లేదు, వాకిళ్లకు తలుపులు లేవు. ఎప్పుడూ హోరుగాలి వీస్తూ ఉంటుంది. ఆ కోట నిండా ఈకలు నింపండి. ఒక్క ఈక కూడా కోటనుంచి ఎగిరిపోకుండా ఆపగలను," అన్నాడు రెండోవాడు.

"నేను అవేమీ చెయ్యనుగాని పరిగెత్తే గుర్రం కాలికి లాడం తగిలించి మేకులు కొట్టగలను," అన్నాడు మూడోవాడు.

"ఇంకొక్క సంగతికూడా చెప్పెయ్యండి. మీ ముగ్గురిలోనూ ఎవరు ఎక్కువ తెలివిగలవాళ్లు?" అని న్యాయాధికారి అడిగాడు.

"నా తెలివితేటలు అద్భుతంలెండి. ఏ మనిషి జుట్టు రంగైనా చెప్పండి. కొలిచినట్టుగా వాడికి చొక్కాను కుట్టేస్తాను," అన్నాడు పెద్దవాడు.

"నేనూ కొలిచినట్టుగా చొక్కా కుట్టేస్తాను! నాకు జుట్టు రంగు కూడా అవసరం లేదు, మనిషి దగ్గటం నాకు వినిపిస్తేనే చాలు!" అన్నాడు రెండోవాడు.

న్యాయాధికారి మూడోవాడికేసి తిరిగి, "నీమాట ఏమిటి?" అన్నాడు.

"నా తెలివితేటలా? ఏ వ్యాజ్యంలోనైనా తీర్పు చెప్పవలిసివచ్చి ఎలా చెప్పాలో తెలియని పరిస్థితి ఏర్పడినప్పటికీ చచ్చినా రెండోకంటి వాడికి ఆ సంగతి తెలియనివ్వను!" అన్నాడు మూడోవాడు.

వెంటనే న్యాయాధికారి గొంతు సవరించుకుని, "మీరు తెచ్చిన తగాదాలో గల న్యాయసూత్రాలన్నిటినీ పరిశీలించిన మీదట ఆ పొలం మీలో మూడోవాడికి చెందుతుందని నేను నిర్ణయించాను. ఆ ప్రకారమే తీర్పుకూడా ఇచ్చేస్తున్నాను!" అన్నాడు.






నేను పడుకున్న ఆ మంచం 8 గజాల ఎత్తు 20 గజాల వెడల్పు వుంది. మెళుకువ వచ్చి లేచి చూద్దునుగదా రెండువైపులా భయంకరమైన రెండు ఎలకలు నామీద దూకబోతున్నాయి. వెంటనే కత్తి దూసి ఒక ఎలకని పొడిచి చంపేశా. రెండోది పారిపోయింది. ఎలక శవం తోక ఏకంగా ఆరడుగులుంది!



ఇంతలో ఇంటావిడ వచ్చి ఎలకనీ రక్తాన్నీ చూసి, తన తొమ్మిదేళ్ల అమ్మాయిని పిలిచి నన్ను జాగ్రత్తగా చూసే బాధ్యత వప్పచెప్పింది.



ఆ అమ్మాయి తన బొమ్మ ఉయ్యాలలో నన్ను వుంచి, వాళ్ళ భాష నేర్పించింది. ఆమె చిన్న పిల్లే కనక నలభై అడుగులే ఎత్తున్నది.



ఓరోజున ఇంటాయన స్నేహితుడు ఒక—ముసిలి రైతు నన్ను చూడ్డానికొచ్చాడు. అతని కళ్లజోడు నాకు చందమామలాగ కనిపించి నవ్వేశాను.



అతను వుడుక్కుని ఇంటాయనని ఓ పక్కకి తీసికెళ్ళి నన్ను వూరూరా చూపించి డబ్బు చేసుకోరాదా అని సలహా ఇచ్చాడు.



ఇంటాయన మర్నాడు నన్నొక పెట్టిలో పెట్టి అమ్మాయి ఒళ్ళో ఆ పెట్టి వుంచి పక్కవూరి సంతకి బయలుదేరదీశాడు.



ఆ గుర్రం ఒకో అంగలో సలభై అడుగులు దాటే స్తూంటే నేను బంతిలాగ ఎగిరెగిరి పడసాగాను. ఆ వూళ్ళో దిగిన తరువాత....



'బుడతడి అద్భుత ప్రదర్శనం!' అంటూ వూరంతా టముకు వేయించాడు. ఒహ గదిలో మూడొందల అడుగుల చదరం వున్న బల్లమీద ప్రదర్శనం ఏర్పాటుచేశాడు. నా దాది అడిగిన ప్రశ్నలకి జవాబు చెప్పడం—కత్తిదూసి ఝళిపించడం—అటూ ఇటూ నడవడం—ఇదీ నేను చెయ్యవలసింది.



నా ఖ్యాతి వూరూరా పాకిపోయింది. డబ్బు బాగా రావడంతో నా యజమాని ఆశకూడా పెరిగింది. తిన్నగా రాజధాని నగరం చేరాడు.



రోజుకు పన్నెండాటలు ఆడ్డంతో నేను బాగా నీరసించిపోయాను. నా అవస్థ చూసి పాపం నా దాది కంట నీరు పెట్టుకుంది.



ఓ రోజు రాణీగారి వద్దనుంచి నన్ను తీసుకు రమ్మని కబురు వచ్చింది. యజమాని వెంటనే రాజభవనానికి బయలుదేరాడు.



రాణీగారి చిటికిన వేలు ముద్దు పెట్టుకుని నమస్కారం చెప్పాను. ఆవిడ తనవద్ద వుండిపొమ్మని అడిగింది. నాకు ఇష్టమే అని చెప్పాను.



యజమానికి వెయ్యి బంగారు నాణాలు ఇచ్చి పంపేశారు. దాదిపిల్ల మాత్రం నాకూడానే వుండాలని షరతు పెట్టాను.



ఆ రైతు డబ్బు ఆశ మూలంగా నన్ను ఎంత అవస్థ పెట్టిందీ వచ్చీ రాని వాళ్ల బాషలో రాణీగారికి చెప్పుకున్నాను.



నా అంత చిన్న ప్రాణికి కూడా ఇంత జ్ఞానం వున్నందుకు ఆవిడ ఆశ్చర్యపోయి నన్ను రాజుగారికి చూపింది. ఆయన మొదట నన్ను ఒక బొమ్మ అని కొట్టిపారేశాడు. కానీ నా మాటలూ చేష్టలూ విని, చూసి నమ్మకం కలిగింది.



నన్ను బాగా పరకాయించి చూసి మరింత ఆశ్చర్యపోయాడు. నన్ను జాగ్రత్తగా చూడమని ఆదేశించాడు.



నా నివాసానికి 16 అడుగుల వెడల్పు 12 అడుగుల ఎత్తు గల ఒక కర్రపెట్టె చేయించారు. రెండు కుర్చీలూ బల్లలూ అమర్చారు.



రోజూ రాణీగారితో భోజనం చేసి రాజుగారితో కబుర్లు చెప్పేవాణ్ణి. ఆయన మా దేశం గురించి ప్రశ్నించి నా జవాబులు శ్రద్ధగా వినేవారు.



రాణీగారికి నేనంటే చాలా ఇష్టంగా వుండేది. అప్పుడప్పుడు నన్ను తన మొహానికి దగ్గరగా నిలబెట్టి అద్దంలో చూసుకునేది.



రాజుగారి కొలువులో ముప్పై అడుగుల మరుగుజ్జు ఒకడుండేవాడు. నేనంటే సహించలేక నన్ను రోజు మీగడ గిన్నెలో పడేశాడు.

గేయ కథలు:

రచన: "రోహిణి"

# మేకపోతు గాంభీర్యం

రంగని దొడ్లో కలవవి యెన్నో రకముల గొర్రెలు మేకలును
కొమ్ము పొటేళ్ళును, పులులనైన ఎగజిమ్మే మేల్ చింబోతులును.

* * *

నిటారు కొమ్ముల చింబోతులలో
నిలువెత్తుది ఒక చింబోతు;
మూరెడు గడ్డం గల చింబోతది
దారి తప్పె ఒకనాడడవిన్

* * *

గాలీ వానా నింగికి, నేలకు
తాళం వేసిన గతినుండెన్
దారి తప్పి చింబోతొక గిరి గుహ
దూరె ప్రాణ రక్షణకై అంత

* * *

మృగరాజొక్కటి అటకే వచ్చెను బిగబట్టిన ప్రాణంతోను
మృగరాజును గని చింబోతప్పుడు జగడంబాడగ కాల్దువ్వెన్

* * *

సింగము దానిని కని యీ గడ్డం
పెంచితి వెందుకు చెప్పుమనన్
తొంభైతొమ్మిది సింహాల్ మ్రింగితి
నీకై పెంచితి ఈ గడ్డం

* * *

అని భీకరముగ చూచుచు ముందుకి
అతి వేగముగ దుముకగనే
అరచేతను ప్రాణాల నుంచుకొని
హడలుచు సింహం పరువెత్తెన్.




టోంక్ తోడా రాజైన రాయ్ సుర్తాన్ అత్యున్నత రాజపుత్ర క్షత్రియ వంశానికి చెందినవాడు. అయితే సిల్లా అనేవాడి నాయకత్వం కింద పఠానులు ఆయనను ఓడించి టోంక్ తోడాను వశపరుచుకున్నారు. రాయ్ సుర్తాన్ వారికి ఓడి మేవార్‌లోని బేదోర్‌లో తల దాచుకున్నాడు. అయితే ఆయనకు తన రాజ్యాన్ని తిరిగి సంపాదించాలన్న కోరిక పూర్తిగా ఉన్నది.

రాయ్ సుర్తాన్‌కు ఉన్న సంతానమల్లా ఒక కుమార్తె. ఆమె పేరు తారాబాయి. ఆమెకు తండ్రిపైన ఎంతో ప్రేమ. చిన్నతనంలోకూడా ఆమె తండ్రి ఒడిలో కూచుని ఆయన చెప్పే వీరగాథలను ఎంతో ఆసక్తితో వినేది. మహావీరుల శౌర్య పరాక్రమాలు వింటూ ఉంటే ఆమె శరీరం పులకించేది.

"నేను మగవాణ్ణిగా పుడితే ఎంత బాగుండేది! టోంక్ తోడాను నీకు జయించి పెట్టి ఉందునుగద!" అనేది తారాబాయి తండ్రితో. తండ్రి పరధ్యానంగా నిట్టూర్చి, "అవును, తల్లీ!" అనేవాడు. మహాశూరుడు కాదగిన కొడుకు కలగలేదన్న విచారం ఆయననుకూడా కొంత బాధిస్తూ ఉండేది. అయితే అందాల కుప్ప అయిన తన చిన్న కుమార్తె అసమాన శౌర్య ప్రతాపాలు అలవరుచుకుంటుందని ఆయన ఊహించలేదు.

వయసు వస్తున్నకొద్దీ తారాబాయికి తన తండ్రి రాజ్యభ్రష్టుడు కావటంగురించి ఆగ్రహం పెరుగుతూ వచ్చింది. టోంక్ తోడా పోయినందుకు తండ్రి ఎంత విచారించాడో, తారాబాయికూడా అంత విచారించింది.

తారాబాయిలో మనోదార్ఢ్యంకూడా చిన్నతనంలోనే పాదుకట్టింది. తన స్వేచ్ఛకు ఏమాత్రం అవాంతరం వచ్చినా ఆమె సహించేది కాదు. తాను స్త్రీనై పుట్టానే, మగవాళ్లతో సమంగా అస్త్రాలు ధరించి తండ్రితోబాటు

యుద్ధం చేసే అవకాశం తనకు లేదే అన్న విషయం ఆమెను అస్తమానమూ బాధిస్తూ ఉండేది.

కాని ఇంతలో ఆమెకు ఒక విషయం జ్ఞప్తికి వచ్చింది: పూర్వకాలపు రాజపుత్ర స్త్రీలు యుద్ధాలలో ముందుండి పోరాడారు; తానుమాత్రం యుద్ధవిద్య నేర్చి తన తండ్రితో బాటు ఎందుకు యుద్ధం చెయ్యరాదూ?

తారాబాయి తన ఆభరణాలూ, అందమైన వస్త్రాలంకారాలూ తీసి అవతల పెట్టి యువకుడి దుస్తులు ధరించింది; అంతఃపుర స్త్రీలు చోద్యంతో ముక్కుమీద వేలు వేసుకున్నారు. ఆమె తన తండ్రివద్దకు వెళ్ళి, "నాన్నా, ఈనాటినుంచీ నన్ను నీ కొడుకులాగా చూసుకో!" అన్నది. తండ్రి ముగ్ధుడై, ఆమె మాట తీసివేయలేకపోయాడు. ఇది సంప్రదాయ విరుద్ధమనీ, తన కుమార్తె ప్రయత్నాలు విఫలమైతే నగుబాటు అవుతుందనీ ఆయనకు తెలుసును.

తారాబాయి అంతఃపుర స్త్రీలను ఎడంగా ఉంచింది. "ఆడది ఇలాగేనా ఉండేది? ఇలా అయితే ఈ పిల్లను ఎవరన్నా పెళ్ళాడతారా?" అని ఆడవాళ్ళు లోకసహజంగా అనే మాటలు విని ఆమె తనలో తాను నవ్వుకున్నది.



అస్త్రవిద్య ఆమెకు చాలా సులువుగా అలవడింది; త్వరలోనే ఆమె విలువిద్యా, ఈటె సాముా నేర్చింది, గుర్రపుస్వారీ నేర్చింది, ఎడారినుంచి పట్టుకువచ్చిన పొగరుబోతు గుర్రాలనుకూడా స్వాధీనంలోకి తెచ్చుకునే శక్తి సంపాదించింది. పధ్నాలుగేళ్ళకే ఆమె అందమూ, పరాక్రమమూ, ధైర్యమూ గురించి ప్రజలు చెప్పుకోసాగారు.

ఈ మధ్యకాలంలో రాయ్ సుర్తాన్ తన రాజ్యాన్ని జయించుకునేటందుకు ఎన్నో ప్రయత్నాలు చేశాడు, కాని ఒక్కటీ ఫలించలేదు. పఠానులను జయించటం ఆయన వల్ల కాలేదు. ఆయన ఇప్పుడు మరొక

ప్రయత్నం చెయ్యటానికి ఉద్యుక్తుడయాడు. "నాన్నా, ఈసారి నన్ను కూడా నీవెంట తీసుకువెళ్లు. నేను ఏ కష్టాన్నయినా ఓర్వ గలను, నాకు యుద్ధంచేసే త్రాణ ఉన్నది," అన్నది తారాబాయి తండ్రితో.

"అలాగే రా, తల్లీ! అపజయం కలిగి అవమానం జరిగితే దాన్ని నాతోబాటు నువు కూడా పంచుకుంటావు," అన్నాడు తండ్రి.

తారాబాయి ఉత్తమజాతి కఠియవాడ్ గుర్రంమీద ఎక్కి తండ్రితోబాటు యుద్ధానికి బయలుదేరింది. అనుకున్నట్టుగానే యుద్ధంలో తండ్రి కూతుళ్లు ఓడిపోయి మిగిలిన సేనతో బెదోర్‌కు తిరిగి వచ్చారు. తారాబాయికి ఇది మొదటి ఓటమి, కాని ఆమె తండ్రి దీన్ని తన ఆఖరు ఓటమిగా భావించి తన రాజ్యంపైన ఆశ వదిలేసుకున్నాడు.

ఈలోపుగా తారాబాయి సౌందర్య సాహసాలను గురించి ప్రతి రాజసభలోనూ చెప్పుకున్నారు. ఎందరో రాజకుమారులు ఆమెను పెళ్ళాడగోరుతూ రాయబారుల ద్వారా ఆమెకు కానుకలు పంపించారు. అందరికీ ఆమె ఒకేముక్క చెప్పింది: "ఎవరు నా తండ్రి రాజ్యాన్ని జయించి పెడితే వారిని పెళ్ళాడతాను!"

తారాబాయికోసం బలవంతులైన మహమ్మదీయులతో వైరం తెచ్చుకోవటం



ఇష్టం లేక ఎవరూ ఈ షరతును అమోదించలేదు.

మేవార్ రాణాకు ముగ్గురు కుమారులు. పెద్దవాడు సంగరాణా, రెండోవాడు పృథ్వీ రాజు, మూడోవాడు జయమల్లు. మేవార్ రాజు కావాలన్న దురాశతో ఈ ముగ్గురూ కలహించుకున్నారు. అనంతరం పృథ్వీ రాజు తన దేశం విడిచి వెళ్లి గోద్వార్ అనే చిన్న సంస్థానానికి అధిపతి అయాడు. జయమల్లు కొంతకాలం అక్కడక్కడా తల దాచుకుని అకస్మాత్తుగా బేదోర్‌లో ప్రత్యక్షమై తారాబాయిని వివాహం చేసు కుంటానన్నాడు.

తారాబాయి అందరితో చెప్పినట్టే జయ మల్లుతో కూడా, "నా తండ్రి రాజ్యం తిరిగి సంపాదించిపెట్టినవాణ్ణి చేసుకుంటాను," అని చెప్పింది. జయమల్లు ఇందుకు వెంటనే సమ్మతించాడు. అయితే పఠానులతో పోరాడి జయించే ఉద్దేశం జయమల్లుకు ఏ కోశానా లేదు. ఒక బొంకు బొంకి తారాబాయిని పెళ్ళాడేస్తే తనకు రంభలాటి భార్య దొర కటమే గాక, రాయ్ సుర్తాన్ సేనలపై తనకు ఆధిపత్యం వస్తుందనీ, వాటి సహాయంతో తాను సంగరాణాను యుద్ధంలో ఓడించి మేవార్ రాజ్యానికి రాజు కావచ్చుననీ జయ మల్లు ఆలోచించాడు.





జయమల్లు వంచకుడని తారాబాయి క్షణంలో గ్రహించి తన తండ్రిని హెచ్చరికగా ఉండమన్నది. జయమల్లు యుద్ధ ప్రయత్నం చెయ్యకపోగా, అతిథిగా ఉండి, కాలుకాలిన పిల్లిలాగా రాజభవనం అంతా తిరుగుతూ తారాబాయి ఒంటరిగా దొరుకుతుందా అని చూడసాగాడు. ఒకసారి ఆమె ఒంటరిగా దొరికినట్టు అతనికి తోచింది. జయమల్లు ఆమెను బలాత్కారంగా పట్టుకోబోయాడు. ఆమె కేక పెట్టింది. తండ్రి వచ్చి జయమల్లును ఒక్క పోటుతో చంపేశాడు.

ఈ సంగతి పృథ్వీరాజుకు తెలిసింది. తనకు తారాబాయి వంటి వీరనారి భార్య అయినట్టయితే ఎంత రాజ్యమయినా జయించవచ్చునని అతనికి తోచింది. ఆమె తండ్రికి రాజ్యం జయించిపెట్టి ఆమెను పెళ్ళాడే నిశ్చయంతో పృథ్వీరాజు బేదోర్ వచ్చి చేరాడు.

తారాబాయీ, పృథ్వీరాజూ ఒకరినొకరు చూస్తూనే పరస్పరం ప్రేమించుకున్నారు. పృథ్వీరాజుకూడా తారాబాయిలాగే అందగాడూ, పరాక్రమవంతుడూనూ.

"మీ తండ్రిగారికి నేను రాజ్యం గెలిచి పెడతాను. లేని పక్షాన నేను రాజపుత్రుణ్ణి కాను!" అని పృథ్వీరాజు చేసిన శపథం తారాబాయికి వీనుల విందు అయింది.

పృథ్వీరాజు వెంటనే యుద్ధ యత్నాలు ప్రారంభించాడు. అతను తన అశ్విక యోధులలో అయిదువందలమందిని, మెరికల వంటివారిని ఏరుకుని, వారిని వెంటబెట్టుకుని యుద్ధానికి ప్రయాణమైనాడు. అతని వెంట తానుకూడా వస్తానని తారాబాయి పట్టుబట్టింది. అతని కష్టసుఖాలలో భాగం పంచుకోవాలన్న కోరిక ఆమెకు అప్పుడే కలిగింది.

పృథ్వీరాజు యుద్ధానికి బయలుదేరిన సమయం అతని విజయానికి ఎంతో అనుకూలమైనది. ఎందుచేతనంటే మహమ్మ

దీయులకు అవి పర్వదినాలు. మహమ్మదు ప్రవక్త మనమలు బలి అయిన రోజులు. దానిని మొహర్రం అంటారు. ఈ రోజులలో మహమ్మదీయులు విచారంలో మునిగి ఉంటారు. పృథ్వీరాజు తారాబాయిలు తమ బలాలతో టోంక్ తోడాను సమీపించటం నగరంలోనివాళ్లు గమనించలేదు, పీర్లు గుండాన పడబోతున్నాయి, అందరూ ఆ ఆవేశంలో ఉన్నారు.

తన కొద్ది బలాన్ని నగరపు గోడల వెలపలనే ఉంచి పృథ్వీరాజు, తారాబాయినీ, మరొక అప్తుణ్ణి వెంటబెట్టుకుని నగరంలో ప్రవేశించాడు. వారిని ఎవరూ శంకించలేదు, అడ్డగించనూలేదు. ముగ్గురిదగ్గిరా ఆయుధాలున్నాయి. ఆ విషయంకూడా గమనించిన వారు లేరు. పఠాను నాయకుడు మాత్రం మిద్దెమీదినుంచి, "ఆ ముగ్గురూ ఎవరు? ఎక్కడివాళ్ళు?" అని కేకపెట్టాడు.

మరుక్షణమే పృథ్వీరాజు విసిరిన ఈటె, తారాబాయి విడిచిన బాణమూ పఠాను నాయకుడికి తగిలాయి. అతను పడిపోయాడు. మహమ్మదీయులకు ప్రమాదం తెలిసివచ్చింది. వారు ఈ ముగ్గురినీ పట్టుకోవటానికి యత్నించారు. కాని నగరంలోని హిందూ పౌరులు పట్టుకునేవారికి ప్రతిబంధకాలు కలిగించి ఆ జనసమ్మర్దంలో



ఆ ముగ్గురినీ నగర ద్వారంకేసి పోనిచ్చారు. కాని, తీరా వారు నగరద్వారం చేరేసరికి ద్వారానికి అడ్డంగా ఒక కొండలాటి ఏనుగు అడ్డుగా నిలిచి ఉంది. వెనకనుంచి వారిని పట్టుకునేవారు తరుముకు వస్తున్నారు. సంకోచించకుండా తారాబాయి తన వాడి అయిన ఖడ్గంతో ఏనుగు తుండం నరికింది. భయంతోనూ, బాధతోనూ ఏనుగు ఘీంకరించుతూ, జనాన్ని తొక్కుకుంటూ పరిగెత్తింది.

ఆ సందులో ముగ్గురూ నగరద్వారం దాటి వెలపలికి పరిగెత్తారు. ఇంకా వారి వెంట ఒక పెద్ద గుంపు ఉండనే ఉంది. అకస్మాత్తుగా ఈ గుంపుకు అయిదువందల మంది ఆశ్విక సైనికులు ఎదురయారు. గుంపులో చచ్చినవారు చావగా మిగిలినవారు చెల్లాచెదరైపోయారు.

పృథ్వీరాజు సైనికులు ఒక్కుమ్మడిగా నగరం ప్రవేశించి వీధులన్నిటా భీభత్సం కలిగించి నగరాన్ని క్షణంలో వశపరుచుకున్నారు. ఈవిధంగా నగరం లొంగిపోగానే, చేసేదిలేక పఠాను పాలకులు చల్లగా జారుకుని, మహమ్మదీయ పరిపాలన సాగే ప్రాంతాలకు వెళ్ళిపోయారు.

రాయ్ సుర్తాన్ తన రాజధానికి మహా వైభవంతో తిరిగి వచ్చాడు. అయనను పృథ్వీరాజు స్వయంగా తీసుకుపోయి సింహాసనంపై కూర్చోబెట్టాడు. తరవాత కొద్దికాలానికే పృథ్వీరాజుకూ, తారాబాయికీ వివాహం జరిగింది.

టొంక్ తోడా నుంచి పఠానులను పారదోలినందుకు అజ్మీరు సుల్తాను ఆగ్రహించి యుద్ధం తలపెట్టాడు. పృథ్వీరాజు ఈ సంగతి పసిగట్టి ముందుగానే తారాబాయితోసహా తానే వెళ్లి సుల్తానును ఓడించి అజ్మీరును స్వాధీనపరచుకున్నాడు.

ఇప్పటికీ అజ్మీరు సమీపంలో కొండపై ఒక దుర్గం ఉన్నది. దీని పేరు తారాఘడ్.





# చెవిటిమేళం

రాత్రి భోజనాల అనంతరం తాతయ్య ఆరు బయట వెన్నెలలో పడకకుర్చీలో కూచున్నాడు. తాతయ్య చిటికెడు పొడుం తీసి పీల్చి, చెయ్యి దులుపుకుంటూ ఈ శ్లోకం చదివాడు:

"పరోక్తం సా ధ్వనాకర్ణ్య
న యుక్తం ప్రతిభాషితుమ్
బహి ర్నిష్కాసితః కోపి
బధిరః ప్రతికూలవాక్."

తాతయ్య చుట్టూ కూచున్న పిల్లలు, "ఆ శ్లోకానికి అర్థమేమిటి, తాతయ్యా?" అని అడిగారు.

"శ్లోకానికి అర్థమా? వినండి చెబుతాను. దాని అర్థమేమిటంటే: ఇతరులు చెప్పేది సరిగా వినకుండా బదులు పలకరాదూ అని! ఒకానొక చెవిటివాడు అసందర్భంగా మాట్లాడినందువల్లనేగదా వాణ్ణి తన్ని తగిలేశారు!" అన్నాడు తాతయ్య.

"ఆ చెవిటివాడు ఎవరు, తాతయ్యా? వాడేమన్నాడు, తాతయ్యా? వాణ్ణి ఎందుకు తన్ని తగిలేశారు, తాతయ్యా?" అంటూ పిల్లలు ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఎందుకర్రా అన్ని ప్రశ్నలూ? ఆ కథ చెబుతాను వినండి," అంటూ తాతయ్య ఈ కథ చెప్పాడు:

వెనకటికి కాంచీపురంలో దేవశర్మ, హరిశర్మ అని ఇద్దరు స్నేహితులుండేవారు. చిన్నతనంలో ఇద్దరూ కలిసి తిరిగారు. పెద్దవారైనాక కూడా వాళ్ళమధ్య స్నేహం ఉండిపోయింది.

ఇలా ఉండగా, దేవశర్మ ఉన్నాడే వాడికి కొంచెం చెవుడు ఆరంభమయింది. అది అందరికీ తెలిసిపోతుందేమోనని వాడు భయపడుతూ ఉండేవాడు.

ఒకసారి హరిశర్మకు జబ్బుచేసింది. ఎన్ని వైద్యాలు చేసినా అది తిరుగుముఖం

తాతయ్యా కథలు:—3 రచన: సి. శేషాద్రి

శాలేదు. తన వ్యాధి నిమ్మళించదని హరిశర్మ నిరాశకూడా చేసుకున్నాడు.

తన మిత్రుడైన హరిశర్మకు జబ్బుగా ఉందని దేవశర్మకు తెలియవచ్చింది. అతణ్ణి చూసి పరామర్శించి వద్దామని బయలు దేరాడు. తనకు మరి చెవుడుగద. చాలా సేపు మాట్లాడుతూ కూచుని ప్రయోజనం లేదు. అవతలివాళ్లు చెప్పేవి తనకు ఎలాగా వినపడవు. తనకు చెవుడని అందరికీ తెలిసి పోతుంది. అంచేత ముచ్చటగా మూడే ప్రశ్నలు వేసి, స్నేహితుణ్ణి పరామర్శించి వచ్చేద్దామనుకున్నాడు.

తనను చూడటానికి దేవశర్మ వచ్చాడన గానే హరిశర్మ సంతోషించి కూచోమని చెయ్యి ఊపాడు.

"జబ్బు ఎలా ఉంది?" అని అడిగాడు దేవశర్మ.

"ఇది నయమయేట్టు లేదు," అన్నాడు హరిశర్మ.

ఆ మాట దేవశర్మకు వినపడదుగా! "భగవంతుడి దయవల్ల అలాగే జరగాలి.... ఔషధం ఏమిటి?" అని మళ్ళీ అడిగాడు దేవశర్మ.

"మృత్యువే ఇక నాకు ఔషధం!" అన్నాడు హరిశర్మ.

"అదే మంచి మందు... ఇంతకూ వైద్యు డెవడు?" అని దేవశర్మ మళ్ళీ హరిశర్మను ప్రశ్నించాడు.

"ఎవడా? యమధర్మరాజు!" అన్నాడు హరిశర్మ వళ్లు మండి.

"అతణ్ణే నమ్ముకో! చాలా గట్టివాడు!" అన్నాడు దేవశర్మ.

ఇదంతా వింటున్న హరిశర్మ బంధువులు దేవశర్మ ధోరణికి మండిపడి, అతణ్ణి పట్టుకు చావగొట్టి, వీధిలోకి గెంటారు...

"చూశారా, అవతలివాడి మాటలు విన కుండా జవాబివ్వటం ఎంత తప్పోనూ!" అన్నాడు తాతయ్య.



# నలందా విశ్వవిద్యాలయం

మన దేశ చరిత్రలో గుప్త రాజులు పాలించిన కాలం స్వర్ణయుగమని చెబుతారు. ఈ యుగంలో కళలూ, శిల్పాలూ ఉత్తమ స్థాయినందుకున్నాయి. కాళిదాసు, దండి మొదలైన మహాకవులు గుప్త రాజుల ఆస్థానంలోవారే. వీరి కాలంలో కొన్ని అజంతా గుహలు కూడా చెక్కబడ్డాయి. అలాగే వీరు అనేక శాస్త్రాలను కూడా ప్రోత్సహించారు.

క్రీ. శ. 413 లో విక్రమాదిత్యుడి కుమారుడు మొదటి కుమార గుప్తుడు చక్రవర్తి అయాడు. ఇతనే నలంద వద్ద బౌద్ధుల విశ్వవిద్యాలయం స్థాపించాడు.

ఈ విశ్వవిద్యాలయంలో బౌద్ధ గ్రంథపఠనమే గాక వేదపఠనం కూడా సాగేది.

ఏడువందల ఏళ్ళపాటు విజయవంతంగా నడిచిన ఈ విశ్వవిద్యాలయానికి విద్యార్థులు మన దేశమంతటినుంచీ మాత్రమే గాక ఆగ్నేయాసియా దేశాలనుంచీ, చీనానుంచీకూడా వచ్చేవారు. ప్రసిద్ధ చీనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ 7 వ శతాబ్దంలో ఇక్కడ చదువుకోవటమే గాక ఈ విశ్వవిద్యాలయం గురించి ఎన్నో గొప్ప విషయాలు రాశాడు.

నలందా విశ్వవిద్యాలయ శిథిలాలు పాట్నా నగరానికి ఆగ్నేయంగా 60 మైళ్ల దూరాన ఉన్నాయి.



స్థల పురాణం: 

# 4. శింగరాయకొండ

బహుమతి పొందిన వ్యాసం

ఒకానొకప్పుడు నారద మహాముని భూలోక సంచారమునకు వచ్చాడట. ఆ కాలమున ఇప్పుడున్నన్ని పుణ్యక్షేత్రాలుకాని, దేవాలయాలుకాని లేవు. అందుచే నారదముని తన నిత్య పూజలకుగాను తనే స్వయముగ శ్రీమహావిష్ణు దశావతార రూపములను ప్రతిష్ఠించి పూజా పునస్కారములు ముగించుకొనుచుండెడివాడట.

తూర్పు కనుమల పరిసరారణ్యములు దండకారణ్యముగ పేరొందియున్నవి. నారదుడు ఇప్పుడున్న శింగరాయకొండ ప్రాంతమునకు వచ్చుసరికి, తన పూజకు వేళైనందున అక్కడే ఒక కొండ గుట్టపై నరసింహ స్వామి విగ్రహమును తూర్పుముఖముగ ప్రతిష్ఠించి, పూజలు ముగించుకొని పోయెనట.

బంగాళాఖాతము అక్కడకు సుమారు 2 మైళ్ళ దూరమున నున్నది. తర్వాత కొన్ని వేల సంవత్సరములకు (ఈ యుగమున) సముద్రముపై పోవు వ్యాపార ఓడలు మున్నుగునవి విగ్రహమునకు ఎదురుగ నున్న సముద్ర భాగమును చేరగనే సముద్రము అల్లకల్లోలమై ఓడలు తలక్రిందులయ్యేడివట.

అట్లు కొన్ని వత్సరములు గడచిన పిదప పూర్వ రాజులలో ఒకరు దీని అంతర్యమును కనుగొనుటకు సముద్రమునకు పడమర వెదకుకొనుచు వచ్చి, కొండమీదనున్న విగ్రహమును గాంచి, అంతయు ఆ స్వామి మహాత్మ్యమే యని గ్రహించి గుడి కట్టించెనట. కాని గుడి వాకిలి విగ్రహ దృష్టులకు ప్రక్కగ నుండునట్లు నిర్మించెను.

తర్వాత కొన్ని సంవత్సరములకు—శ్రీకృష్ణదేవరాయుల వంశస్థుడు కావచ్చును—శింగరాజనువాడు ఆ కొండమీదనే మరియొక గుడి నిర్మించి వేరొక విగ్రహమును ప్రతిష్ఠించెనట. (అక్కడ ఇపుడు శ్రీకృష్ణదేవరాయుల శిలా శాసనములును వున్నవి). అప్పటి నుండి ఆ కొండకు, అక్కడేర్పడిన గ్రామమునకు 'శింగరాయకొండ' యను పేరు వచ్చినది. ఇప్పటికిని అక్కడ మాఘమాసమునందు తిరునాళ్ళ జరుగుచున్నది.

మొట్టమొదట ప్రతిష్ఠించిన విగ్రహము కనుక, నారదుడు ప్రతిష్ఠించిన స్వామిని 'తాత నరసింహస్వామి' యనియు 'ముసలి నరసింహస్వామి' యనియు వ్యవహరింతురు. పూర్వము ఈ తాత స్వామికి నిత్యము పూజలు చేసి, ఆ ఫల పత్ర నైవేద్యములను క్రూర జంతు బాధలకు భయమొంది, ఒక సొరంగము ద్వారా పడమర రెండామడల దూరమున ఒక పుణ్య ప్రదేశమున పోసెడివారట. ఆ నైవేద్యములే కొంతకాలమునకు కొండ గుట్టగా తయారై, ఆ కొండపై నరసింహ స్వామి వెలసినాడట. ఆ కొండనే మాల్యాద్రి (మాల్య + అద్రి = పుష్ప పర్వతము) అనియు, పామరులు మాలకొండ అనియు, ఆ స్వామిని మాల్యాద్రి నరశింహస్వామి యనియు, మాలకొండ స్వామి యనియు పిలిచెదరు.

దేశంశెట్టి రామారావు, ఉలవపాడు, నెల్లూరుజిల్లా.

[బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.]

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 డిసెంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: "దేబూచు లాడుతాం

రెండవ ఫోటో: దొరికితే పట్టేస్తాం"

పంపినవారు: E. N. ఆచార్య,

అంతర్వేదిపాలెం P.O., (వయా) నర్సాపురం, (పశ్చిమ గోదావరిజిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




1. పి. సుబ్బారావు, బరంపురం

"మృచ్ఛకటికము" కూడా అచ్చంగా చారుదత్తుడు కథయే...పూర్తిగా ఉంది. కాని రచయిత శూద్రకరాజు.

ఈ విషయమై చాలామంది పాఠకులు రాశారు. శూద్రకుడు కాళిదాసు కాలంవాడు. భాసుడు అంతకంటె చాలా ముందువాడు. భాసుడు అసంపూర్తిగా విడిచిన "చారుదత్తుడు" నాటకాన్ని శూద్రకుడు పూర్తిచేసి "మృచ్ఛకటికం" అని పేరు పెట్టాడు.

2. సి. హెచ్. కృష్ణారావు, పలాసా

8 వ తరగతి నలందా వాచకము "పంచరాత్రము" పాఠములో (కౌరవు లకు పాండవులకు) యుద్ధము జరుగలేదని వ్రాశారు. దుర్యోధన మహారాజు (పాండవులకు) అర్ధరాజ్యమిచ్చుటకు ఒప్పుకున్నట్లు మాకు తెలియుచున్నది.

"పంచరాత్రం" భాసుడి నాటకమే. (దీని కథను "చందమామ"లో ప్రచురించ లేదు.) ఉత్తరగోగ్రహణంలో బృహన్నల అర్జునుడని తెలియగానే దుర్యోధనుడు ద్రోణుడితో పాండవులకు అర్ధరాజ్యమిస్తానని మాట ఇచ్చినట్టు భాసుడు సొంతాన కల్పించాడు. కాని అది మహాభారత కథకు విరుద్ధం.

3. డా. జి. రామచంద్రరాజు, లక్కవరం

"చందమామ" గోళమా? దేముడా? పత్రికా?

అందరికీ అందుబాటులో ఉన్న "చందమామ" ప్రస్తుతానికి పత్రికే. అయితే "చంద మామ" అనే గోళానికి మంచి భవిష్యత్తు ఉన్నట్టు చెప్పుకుంటున్నారు.

4. వాశికర్ల రామక్రిష్ణారావు, ఖమ్మంమెట్టు

గురూ, ప్రపంచమున అందరికన్న పొడుగాటివారెవరు? ఏదేశమున గలరు?

స్వీడెన్ దేశస్థులు చాలా ఎత్తుగా ఉంటారట.

5. యమ్. సుబ్రహ్మణ్యం, నౌపడా

అన్నయ్యా, బాతు గ్రుడ్లను కోడి పొదుగుతుందంటారు. కాని "అనాకారి బాతుపిల్ల" కథలో బాతు గ్రుడ్లను పొదిగినట్లు వ్రాసిఉంది. కారణం?

ఈ ప్రశ్నకూడా చాలామంది వేశారు. "అనాకారి బాతుపిల్ల" కథ రాసిన క్రిస్టియన్ ఆండర్సన్ డెన్మార్క్ దేశస్థుడు. ఆ దేశంలో బాతులు తమ గుడ్లను పొదుగుతాయో, లేక కథ కోసం అతను కల్పన చేశాడో!

6. కొత్త గోపాలరావు, సాలూరు

"గలివర్ యాత్రలు" ఎన్ని భాగములు ప్రచురించెదరు?

డిసెంబరు సంచికతో "గలివర్ యాత్రలు" ముగుస్తుంది.

7. అందే చక్రపాణిరావు, చదలవాడ

"జ్వాలాద్వీపం" లోని అమరపాలుడు, శత్రుపక్షం అయిన పులిరాయుళ్లు ఒకేలాగుంటారు, కారణం?

అమరపాలుడుకూడా మొదట పులిరాయుళ్ళలోవాడేగద!

8 ఎ. శేషగిరిరావు, తిరుపతి

"చందమామ" దీపావళి పండుగకుకాక ఇతర పండుగలకు—వినాయక చవితి, సంక్రాంతి మొదలగు పండుగలకు—కూడా ప్రత్యేక సంచికలు ఉంచితే బాగుణ్ణు.

అప్పుడు దాదాపు ప్రతినెలా ప్రత్యేక సంచికలు వేయవలిసివస్తుంది. అందులో ప్రత్యే కత ఏముంటుంది?

9. జి. సుబ్రహ్మణ్యశర్మ, మాలాక్రజ్‌గిరి

"చరిత్ర ప్రసిద్ధ ప్రదేశాలు" ప్రారంభించకపోవడానికి కారణం?

"స్థలపురాణాలు" అన్న శీర్షిక అదే.

10. జె. జె. జగన్, కాకినాడ

"చందమామ" (సెప్టెంబరు 60)లో "తాబేటిచిప్ప" కథలో తాబేటి చిప్పలో వెలలేని ముత్యాలుంటాయని వ్రాశారు. అది నిజమా?

మామూలు తాబేటి చిప్పలలో ముత్యాలుండవు. ఈ కథలో చెప్పబడిన తాబేటిచిప్ప చాలా పెద్దది. అందులో ముత్యాలుండటం కల్పనే కావచ్చు.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు గాలిపటం ఎగరవేసేందుకు ఊరిబయట చేలల్లోకి వెళ్లారు. దాసు చేతిలోవున్న ఎర్ర కాయితపు గాలిపటాన్ని చూడగానే, చేలల్లో మేస్తున్న ఒక పొగరుబోతు ఎద్దు వాళ్ల వెంటబడింది. దాసూ, వాసూలు పరిగెత్త సాగారు. "టైగర్" దాసు చేతిలోని గాలిపటం దారం నోట కరచుకుని మరోపక్కకు పరిగెత్తింది. ఎద్దు దాని వెంటబడింది. "టైగర్" కొంత దూరం పరిగెత్తి గాలిపటాన్ని కాలవ ఒడ్డునున్న ఒకచిన్న చెట్టుబోదెకు చుట్టి పక్కకు పారిపోయింది. బుసలుకొడుతూ దూకుడుగా వచ్చిన ఎద్దు చెట్టును ఢీకొట్టి, అది ఫెళ్లుమని విరగగానే, ఆ వూపులోవెళ్లి కాలవలో పడిపోయింది.







Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఇప్పుడు
## మీకు ప్రియమైన
## ఆరోగ్యముచేకూర్చే
# విటమినులు కలిసిన
## వాటర్‌బరీస్ కాంపౌండ్
## తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్చబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది శరీరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




## వాటర్‌బరీస్
విటమిన్
## కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.

దగ్గు, జలుబులకు క్రియోజోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎర్ర లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



ఆయన తెల్లని దుస్తులను
చూస్తే 'టినోపాల్' పెట్టినవని
తెలుస్తూనే ఉంది.







# టినోపాల్

కొంచెము టినోపాల్ తెల్లని దుస్తులను
ఎంతో తెల్లగాచేయును!

టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఏ. బేసెల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరుచేయబడిన ట్రేడు మార్కు.

తయారుచేయువారు : సుహృద్ గెయిగి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి, బరోడా

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు : సుహృద్ గెయిగి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పి. ఓ. బాక్స్ 965, బొంబాయి-1.





---









# చర్మకారుడు – బుడతలు



పూర్వం ఒక చెప్పులు కుట్టేవాడు ఉండే వాడు. అతడు ఎంతో న్యాయస్తుడు. దురదృష్టం! పాపం, ఒకదినం వాడదగ్గర ఒక జతజోళ్లకు సరిపోయే చర్మంమాత్రమే ఉంది. ఆరాత్రి విచారిస్తూ పడుకున్నాడు. తెల్లవారింది, ఆశ్చర్యం! చర్మానికి బదులు అందంగాకుట్టిన జోళ్లజత ఉంది. రెట్టింపు వెలకు దాన్ని అమ్మి రెండు జతలకు సరి పోయే చర్మం కొన్నాడు. మర్నాడు రెండు జతలు తయారై ఉన్నాయి. ఇల్లా కొంత కాలం జరిగింది. అతడు భాగ్యవంతు డైనాడు.

ఒకరోజున పెట్టిన చర్మం పెట్టినట్టే ఉంది. ఏంచెప్మా! అని ఆరాత్రి మొగుడు పెళ్లాం ఒక మూల థాక్కొని చూస్తున్నారు. నిశరాత్రివేళ ఇద్దరు బుడతలు మెల్లిగా వచ్చి అటు ఇటు చూచి కోపంతో చక్కా పోయారు. చర్మకారునిభార్య "వాళ్లు ఏమైనా బహుమానాన్ని నిరీక్షిస్తున్నారేమో" అంది.

తరువాత రెండు రాత్రిళ్లు మంచిమంచి వస్త్రాలు ఆభరణాలు అక్కడ పెట్టారు. అంగుష్టంగాళ్లు అవి ఏమీ ముట్టుకోలేదు. "ఓహో నాకు తెలుసు వాళ్లను ఎల్లా సంతోషపెట్టాలో" అని వాని భార్య ఆరాత్రి ఒక అందమైన ప్యారీవారి బిళ్లల డబ్బాను చర్మందగ్గర పెట్టింది. ఇక చూడండి! మర్నాడు ఉదయం జోళ్లజతలు తయారై ఉన్నాయి. ప్యారీ వారి బిళ్లల డబ్బాతో బుడతలు మాయమైపోయారు.



నీతి:




ప్యారీవారి బిళ్లలతో
అన్నిరకాలవారిని సంతోష పెట్టవచ్చు



ప్యారీవారి బిళ్లలు ఎంతో రుచికరమైనవి, శుభ్రమైనవి, పుష్టికర మైనవి. విడిగాగాని ఫ్యాన్సీ డబ్బాలలోగాని కొనుక్కోవచ్చు

తయారీ :
ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్., మద్రాసు

Photo by P. Krishnakumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

దొరికితే పట్టేస్తాం "

పంపినవారు :
ఇ. ఎస్. ఆచార్య-నర్సాపురం

